శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# శ్రీవాగుక్తిప్రశస్తిః






'పండితరత్న' డా|| ఉ.వే.ఈయుణ్ణి అఴగ శింగరాచార్యులు

# శ్రీవాగుక్తిప్రశస్తిః

★★★★★★

శ్రీవాగుక్తిప్రశస్తిం లఘుసుకృతి మిమాం శింగరార్యోఽర్పయామి
క్లుప్తాం మాలేవ భక్త్యాఽష్టోత్తరశతకమితైః శ్లోకరూపైశ్చ పుష్పైః,
పూర్వాచార్యోక్తిసక్త్యా శతగుణితరుచిం రంగరామాఖ్యపుత్ర—
ద్వారా శ్రీకేశవాంభోరుహపదయుగళీసన్నిధానే.ప్రణమ్య.

శ్రీవాగుక్తిప్రశస్తి అనే ఈ చిన్న కృతిని శింగరాచార్య దాసుడు 108 శ్లోకాల రూపంలోని పూలతో ఒక మాలగా భక్తితో కూర్చాడు. పూర్వాచార్యుల సూక్తుల సంబంధంవల్ల రుచిని కలిగినది అయిన ఈ శ్లోకమాలికను దాసుడు తన కుమారుడైన పరమపదవాసి, శ్రీమాన్. అనంతరంగరామన్ ద్వారా భగవంతుని శ్రీచరణపద్మయుగళిలో నమస్కరించి సమర్పిస్తున్నాడు.

ఆసక్తిః శఠకోపసూరివిషయే, తస్య ప్రబంధేషు వా
తేఽన్యూనా వరపుత్ర! రామ! సతతం తాం సంస్మరన్నస్మ్యహమ్,
తత్, తే సంస్మృతయే శఠాంతకకవేః కాంచిత్ విరచ్య స్తుతిం
తత్తృప్త్యై పరమాత్మపాదసవిధే తామర్పయామ్యాత్మజ!

అనంతరంగరామా! కుమారా! నమ్మాళ్వార్ల విషయంలో, వారి ప్రబంధాల విషయంలో నీకు కల ఆసక్తి చాలా గొప్పది. దానిని నేను స్మరిస్తున్నాను. అందువల్ల ఇప్పుడు నీ స్మృతికోసం ఆ నమ్మాళ్వారుల విషయంలో ఒక స్తోత్రాన్ని రచించి, దానిని భగవంతుని పాదాలలో సమర్పిస్తున్నాను.

★★★★★★

1) వైశాఖే వరమాసి నిత్యమననీయేఽస్మిన్ విశాఖాభిధే
తారే ప్రాదురభూత్ పరాంకుశకవిః యోఽస్మాదృశాం భాగ్యతః,
తద్రూపం నయనద్వయస్య పురతః, తత్సూక్తిజాలః శ్రుతి
ద్వంద్వే తత్ప్రతిపాదితార్థవితతిః చిత్తే పి నో భ్రాజతామ్.

వైశాఖ మాసంలో నిత్యం స్మరించదగిన విశాఖానక్షత్రంలో మన అదృష్టం వల్ల నమ్మాళ్వారులు అనే కవి అవతరించారు. వారి రూపం మన కంటి ముందు ప్రకాశించాలి. వారి సూక్తులు మన చెవులలో ప్రకాశించాలి. వారి సూక్తుల అర్థం మన మనసులో ప్రకాశించాలి.

2) కోఽస్మిన్నస్తి కవిః పరాంకుశసమోఽన్యో భూతలే విస్తృతే ?
శ్రీవాగుక్తిసమా చ కా కృతిరిహాఽన్యాఽస్తే మనోహారిణీ,?
కో వాఽన్యోఽస్త్యపరో వదత్విహ భవాన్ తారో విశాఖాసమో
నాఽస్తే నాఽస్తి చ నాఽస్తి, తత్ర న హి సంశీతిః లవాపి, ధ్రువమ్.

విశాలమైన ఈ భూతలంలో నమ్మాళ్వారులతో సమానమైన కవి ఇంకొకరు ఎవరు ఉన్నారు? తిరువాయ్ మొళి ప్రబంధంతో సమానమైన ఇంకొక కావ్యం ఏది ఉన్నది? విశాఖా నక్షత్రంతో సమానమైన ఇంకొక నక్షత్రం ఏది ఉన్నది? చెప్పు.
ఇక్కడ కొంచెం కూడా సందేహం లేనే లేదు.

3) ఏకా సూక్తిరపి క్షమా హి భవినాం సంసారసంతారణే
శ్రీమన్మారసమాఖ్యకస్య వకుళాభూషస్య నః స్వామినః
తాదృశ్యో విలసంతి నైవ శతశః దివ్యాః, సహస్రాధికాః
భాసంతే,నిరతం మనః కలయ తా అర్థానుసంధానతః.

మారన్  అనే పేరు కలిగిన వకుళభూషణలైన మన స్వామి నమ్మాళ్వారులు అనుగ్రహించిన వేలాది సూక్తులలో ఒక్క సూక్తి చాలు, ఈ సంసారులు తరించడానికి. అటువంటి సూక్తులు వందలుగా కాదు, వేలాదిగా ఉన్నాయి. వాటిని,ఓ మనసా! నీవు అర్థంతో పాటు అనుసంధించు.

4) ఋగ్వేదం ప్రథమా కృతిః వివృణుతే శ్రీవృత్తనామ్ని తథా
ద్వితీయాకకృతిః బ్రవీతి చ యజుర్వేదార్థతత్త్వం వరమ్,
వక్త్యాధర్వణతత్త్వమత్ర బృహదంతాదిః తృతీయా కృతిః
సామ్నాం వక్తి సహస్రగీతసుకృతిః తత్త్వం శఠారేః కవేః.

నమ్మాళ్వారులు అనుగ్రహించిన ప్రబంధాలునాలుగు.  వాటిలో మొదటి ప్రబంధం తిరువిరుత్తం. ఇది  ఋగ్వేదాన్ని వివరిస్తున్నది. రెండవ ప్రబంధం తిరువాశిరియం అనే ప్రబంధం. ఇది గొప్పదైన యజుర్వేదంలోని తత్వాన్ని వివరిస్తున్నది. మూడవ ప్రబంధం పెరియ తిరువందాది. ఇది  అధర్వణవేద తత్వాన్ని తెలుపుతుంది. చివరిది వేయి పాశురాలను కల తిరువాయ్ మొళి ప్రబంధం. ఇది సామవేద తత్వాన్ని తెలియజేస్తున్నది

5) ప్రాదాత్ శ్రీశఠజిద్గురుర్హి మునయే నాథాయ సర్వాం శ్రుతిం
యోగే ద్రావిడవాఙ్మయీం కరుణయా నిర్వ్యాజయా భవ్యయా,
తేనాంగీ సమభూత్ పరాంకుశగురుః సూరిక్రమేఽన్యేఽభజన్
తస్యాంగత్వమితి బ్రువంతి గురవః సత్సంప్రదాయస్థితాః.

యోగదశలో శ్రీనాథమునులకు నమ్మాళ్వారులు ద్రావిడప్రబంధాన్ని అంతటినీ అనుగ్రహించారు. అందుచేత వారు ఆళ్వారులు అందరిలో అంగి అయినారు, అంటే

ప్రధానులు అయినారు. మిగిలిన ఆళ్వారులు వారికి అంగ భూతులు అయినారు– అని సత్ సంప్రదాయం తెలిసిన ఆచార్యులు అంటారు.

6) ఆద్యే శ్రీవ్రతనామకే శఠరిపుః దేహాత్ యయాచే తథై
వాజ్ఞానస్య నివృత్తిమీశసవిధేఽసద్వృత్తస్య చార్తేర్వశాత్,
తస్యానంతర ముక్తవాన్ మురరిపోః దివ్యస్వభావాకృతీః
లీలాసద్గుణసంతతిం చ విశదం గ్రంథే ద్వితీయేఽప్యయమ్.

నమ్మాళ్వారులు తమ మొదటి ప్రబంధమైన తిరువిరుత్తంలో నీచమైన దేహసంబంధం ,అజ్ఞానం, అసత్ ప్రవృత్తి తీరాలని భగవంతుని ఆర్తితో ప్రార్ధించారు. భగవంతుడు వారికి అపుడు తన అనుభవాన్ని కలిగించగా, రెండవ ప్రబంధమైన తిరువాశిరియంలో భగవానుని స్వరూప రూపగుణలీలాదులను అనుభవించి వర్ణించారు.

7) ఇత్థం దివ్యతనోశ్చ భూషణతతేః భవ్యానుభూత్యా హరేః
ప్రాదుర్భూతమహార్తి మత్ర మహదంతాదౌ శఠారిః కవిః
వ్యక్తీకృత్య ,పరాం పరస్య సపది ప్రత్యక్షతః దర్శనే
స్వాశాం తా మనివార్యవేగభరితాం ప్రోవాచ రమ్యోక్తిభిః.

ఈ విధంగా అనుభవించిన మానసికమైన భగవంతుని దివ్యమంగళ విగ్రహ భూషణాల అనుభవవల్ల నమ్మాళ్వారులు వెంటనే ఆ భగవంతుని అనుభవాన్ని సాక్షాత్తుగా పొందాలనే, నివారించడానికి వీలుకాని వేగాన్ని కలిగి ఉండడం చేత, అందమైనది అయిన గొప్ప ఆర్తిని పొందారు దానివల్ల కలిగిన భగవదనుభవంలోని ఆశను పెరియ తిరువందాది అనే ప్రబంధంలో అందమైన సూక్తులతో ఆవిష్కరించారు.

8) తామాశాం కమలాపతిః శఠరిపోః దృష్ట్వా దయాసాగరః
ప్రీత్యా తస్య దిదేశ పూర్ణమధురాం స్వస్యానుభూతిం పరామ్,
తామేతాం శఠజిత్కవిః వితనుతే గాథాసహస్రేణ యత్
శ్రీవాగుక్తిపదేన దేశికవరైః సంస్తూయతే భక్తితః.

ఈ విధంగా నమ్మాళ్వారులకు కలిగిన ఆ ఆశను చూచి లక్ష్మీ నాథుడు ప్రీతితో తనకు సంబంధించిన పరిపూర్ణమైన, గొప్పది అయిన అనుభవాన్ని వారికి కలిగించి, వారికి కలిగిన ఆశను సఫలం చేశాడు. ఆ అనుభవాన్ని నమ్మాళ్వారులు వేయి పాశురాలను కల ఒక ప్రబంధంలో వ్యక్తం చేశారు. దీనిని మన పూర్వాచార్యులు తిరువాయ్ మొழி అనే పేరుతో భక్తితో కీర్తిస్తున్నారు.

9) లక్ష్మ్యా సామ్యం సుమిత్రాసుతవరసమతాం చాహు రార్యాః శఠారేః
ఏవం శత్రుఘ్నసామ్యం చ భరతసమతాం తత్తదుక్త్యర్థశక్త్యా,
సర్వం హ్యేతచ్చ వక్త్యద్భుతరసికవరాభిజ్ఞహృద్యానవద్యం
సిద్ధం సత్సంప్రదాయేఽపి చ మధురతమం జ్ఞేయతత్త్వార్థజాలమ్.

తిరువాయ్ మొழி ప్రబంధంలో నమ్మాళ్వారులు ప్రయోగించిన ఆయా పదాల సారస్యాన్ని బట్టి నమ్మాళ్వారులకు సీతాదేవితో, లక్ష్మణునితో ,శత్రుఘ్నునితో, భరతునితో పోలికలను మన పూర్వాచార్యులు నిరూపించారు. ఈ విధంగా చెప్పబడే సామ్యాల ద్వారా వ్యక్తమయ్యే తత్త్వాలు అన్నీ యథాలాపంగా చెప్పిన మాటలు కావు. సత్ సంప్రదాయ సిద్ధమైనవి. రసికులకు, అభిజ్ఞులకు ఆనందాన్ని కలిగించేవి, ఏ దోషాన్ని లేనివి, మనం తప్పక తెలుసుకోవలసినవి,చాలా మధురమైనవి.

10) ఆద్యం యత్ శతకత్రయం శఠజితో గ్రంథేఽతిమే తత్ బ్రవీ–
త్యర్థం మంత్రమణిస్థితోత్తరదళే కైంకర్యరూపం హరేః,
న్యాసం పూర్వదళోదితార్థవివృతిం వక్తి త్రయం చోత్తరం
సేయం పూర్వగురూక్తరమ్యసరణిః జేజేతి గోష్ఠ్యాం విదామ్.

నమ్మాళ్వారులు అనుగ్రహించిన చివరి ప్రబంధం అయిన తిరువాయ్ మొழிలోని మొదటి మూడు శతకాలు మంత్రరత్నం అనబడే ద్వయమంత్రంలోని ఉత్తరార్ధమైన భగవంతునకు కైంకర్యం చేయడం అనే అర్థాన్ని విశదీకరిస్తున్నాయి. ఆ విధంగానే, తర్వాత ఉండే మూడు శతకాలు ద్వయ మంత్రంలోని పూర్వార్ధంలో చెప్పబడిన ప్రపత్తిని విశదం చేస్తున్నాయి. మన పూర్వాచార్యులు తెలిపిన ఈ వివరణ విద్వాంసుల గోష్ఠిలో గొప్పగా ప్రకాశిస్తున్నది.

11) శ్రీవాగుక్తిసమాహ్వయాంఽతిమకృతిః శ్రీమచ్ఛఠారే ర్గురోః
ఛాందోగ్యోపనిషత్సమేతి మహతా మస్మద్గురూణాం మతమ్,
ఉద్గీథప్రణవశ్చ తత్కృతివరస్యాద్యే హి గీతే స్ఫుటం
లక్ష్యో వ్యుత్క్రమతః తదేతదఖిలం వ్యాఖ్యానగమ్యం భవేత్.

నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొழி అనే పేరు కలిగిన ప్రబంధం. చాందోగ్యోపనిషత్ సమానమని మన పూర్వాచార్యుల అభిప్రాయం.ఆ విధంగానే ,చాందోగ్యోపనిషత్ సారంగా చెప్పబడే ఉద్గీథ ప్రణవం ఈ ప్రబంధంలోని మొదటి పాశురంలో వ్యుత్క్రమంలో కూర్చబడడం గమనించవచ్చు. దీని వివరం అంతా పెద్దల వ్యాఖ్యానం ద్వారా తెలియాలి.

12) లోకాచార్యగురూత్తమాస్తు కథయంత్యన్యం విశిష్టం క్రమం
యస్మిన్ సర్వమపి క్రమేణ వివృతం గాథాసహస్రే ద్వయమ్,
మంత్రస్థాని పదాని చాత్ర వివృతాన్యస్మిన్ శఠారేః దశ
శ్రీవాగుక్తికృతౌ క్రమేణ శతకేష్వివ్త్యేతదేతన్మతమ్.

శ్రీపిళ్లైలోకాచార్యులవారు అనే పూర్వాచార్యులు ఇంకొక విధంగా అభిప్రాయపడ్డారు. వారి క్రమం కూడా విశిష్టమైనది. ఆ క్రమాన్ని అనుసరించి ద్వయ మంత్రం సక్రమంగా తిరువాయ్ మొళ్లిలో వివరింపబడింది. ద్వయమంత్రంలో ఉండే 10 పదాలు తిరువాయ్ మొళ్లిలో ఉండే 10 శతకాలలో వివరింపబడింది అనేది వారి మతం.

13) సేవ్యత్వం భోగ్యభావః శుభమయతనుతా సర్వభోగ్యాధికత్వం
ప్రాప్యత్వప్రాపకత్వేఽపి నతసులభతా ఽ నిష్టహృత్త్వం శ్రితానామ్,
భక్తస్వాంతానుసారిత్వమపి నిరుపధిస్నిగ్ధతా సత్పదవ్యాం
సాహాయ్యం చేతి విష్ణోః దశ భవికగుణా అంతిమే కావ్యరత్నే
భాంతి శ్రీమచ్ఛఠారే రితి వదతి మహాన్ దేశికో వేంకటేశః.

శ్రీవేంకటేశులు అనే పేరు కలిగిన వేదాంత దేశికులు ద్రవిడోపనిషత్ తాత్పర్య రత్నావళి అనే మహా గ్రంథంలో భగవంతుని పది గుణాలు తిరువాయ్ మొళ్లి లోని 10 శతకాలలో ప్రకాశిస్తున్నాయి అని చెప్పారు. ఆ గుణాలు ఏమి? అంటే, సేవించదగినవాడై ఉండడం, భోగ్యత, దివ్యమంగళ విగ్రహాన్ని కలిగి ఉండడం, భోగ్యమైన వస్తువులు అన్నిటి కంటే చాలా భోగ్యంగా ఉండడం, భక్తులకు ఉపాయంగా, ప్రాప్యంగా ఉండడం, భక్తులకు సులభుడై ఉండడం, వారి అనిష్టాలను తీర్చడం, వారి అభిప్రాయాన్ని బట్టి వర్తించడం, భక్తుల విషయంలో సహజమైన స్నేహం కలిగి ఉండడం, వారికి మోక్షమార్గంలో సహాయంగా ఉండడం అనేవి ఈ పది గుణాలు. ఇవి అన్ని ఆయా

శతకాలలో ఉండే ఒక్కొక్క దశకాన్ని ప్రధానంగా చేసుకొని నిర్ణయింపబడినవని తెలియాలి.

14) విష్ణోః నామసహస్రకే మురభిదః సద్రూపలీలాగుణా—
దీనాం వైభవముచ్యతే సురుచిరైః తత్తత్ శుభైః నామభిః,
ఏవం శ్రీశఠజిత్కృతాంతిమకృతావప్యత్ర గీతైః గుణాః
లీలాద్యా పురుషోత్తమస్య చ హరేః ప్రోక్తా ఇతి ప్రాజ్ఞవాక్.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రంలోని నామాలలో భగవంతుని గుణాలు, లీలలు మొదలైనవి స్తుతింపబడినవి అని భట్టర్ మొదలైన పూర్వాచార్యులు తెలియజేశారు. ఆ విధంగానే తిరువాయ్ మొழி ప్రబంధంలోని పాశురాల ద్వారా భగవంతుని గుణ విభవ లీలాదులు వర్ణింపబడ్డాయి అని విజ్ఞుల వచనం.

15) ఏకైకస్మిన్ శతే శ్రీశఠమథనకవే రంతిమే஽స్మిన్ ప్రబంధే
శ్రీశస్యైకైకభవ్యామలగుణకథనం స్యాత్ కథం యుక్తియుక్తమ్?
అత్రార్యా ఊచు రేనాం " శతగతదశకవ్యక్తతత్తద్గుణస్య
ప్రాధాన్యాత్ యుక్తమేవే"తి సముచితసమాధానసూక్తిం సమగ్రామ్.

ఇక్కడ సహజంగా ఒక సందేహం కలగవచ్చు. భగవంతుడు సకల కల్యాణ గుణాలను సహజంగా కలవాడు కదా. అటువంటప్పుడు తిరువాయ్ మొழி ప్రబంధంలోని ఒక్కొక్క శతకంలో ఒక్కొక్క గుణం ప్రకాశిస్తున్నదని ఏ విధంగా చెప్పబడుతున్నది? అనేది ఆ సందేహం. దీనికి తగిన, సమగ్రమైన సమాధానాన్ని మన పూర్వాచార్యులు తెలియజేశారు. ఈ ప్రబంధంలోని శతకాలలో ప్రతి శతకంలోని ఒక దశకంలో భాసించే భగవంతుని విలక్షణమైన ఒక కళ్యాణగుణం ఆ శతకంలో ప్రధానం

కనుక, అది ఇక్కడ ఈ శతకంలో ప్రతిపాదించబడే గుణంగా చెప్పబడుతున్నది అనేది ఆ సమాధానం.

16) పౌర్వాపర్యే కృతీనాం వకుళధరకవేః కోఽత్ర నిర్ణాయకః స్యాత్
ఇత్యేషా స్యాత్ విశంకా సహృదయహృదయే, తత్ర సేయం సమాధిః,
తత్తద్గ్రంథోక్తిభాస్వచ్ఛఠరిపో రనుభూతిద్ధభవ్యక్రమేణ
ప్రేక్ష్యాద్యంతాదిభావం జగదురిహ సుధీశేఖరా దేశికా నః.

నమ్మాళ్వారులు అనుగ్రహించిన నాలుగు ప్రబంధాలలో "ఇది మొదటి ప్రబంధం, ఇది చివరి ప్రబంధం " అని ఏ విధంగా నిర్ణయింపబడింది? అనే సందేహం సహృదయుల హృదయంలో కలుగుతుంది. దీనికి సమాధానం ఏమంటే, ఆయా ప్రబంధాలలో నమ్మాళ్వారుల సూక్తుల ద్వారా గోచరిస్తున్న వారి అనుభవక్రమాన్ని ఆధారంగా చేసికొని "ఈ ప్రబంధం మొదటిది, ఇది రెండవది, ఇది మూడవది, ఇది చివరిది" అని గొప్ప బుద్ధిశాలురైన మన పూర్వాచార్యులు నిర్ణయం చేశారు.

17) నామాన్యేతత్కృతీనామపి కథమిహ కైః వ్యాకృతానీతి శంకా
జాయేతాత్రోత్తరం చ ప్రదదతి గురవః సమ్యగస్మాక మేవమ్,
ప్రాప్తశ్రీమచ్ఛఠద్విట్ సుమధురకరుణో రంగనాథో మునీంద్రః
సూరీణాం సత్కృతీనాం సముచితవిధయా నామధేయాని చక్రే.

నాలాయిర దివ్య ప్రబంధాలకు అన్నిటికి ఆయా పేర్లను ఎవరు ఏవిధంగా పెట్టారు? అనే సందేహం కూడా జిజ్ఞాసువులకు కలుగుతుంది.దీనికి తగిన సమాధానాన్ని చక్కగా మన పూర్వాచార్యులు చెప్పారు. శ్రీ నమ్మాళ్వారుల మధురమైన కృపను పొందిన శ్రీమన్నాథమునులు ఈ ప్రబంధాలకు అన్నిటికీ తగిన విధంగా ఆయా నామాలను పెట్టారు.

18) ధత్తే లక్ష్మణసామ్య మేష శరజిత్ సంసేవనే శ్రీపతేః
భాతి శ్రీభరతోపమశ్చ బహుథైవం పారతంత్ర్యాత్ హరౌ,
శత్రుఘ్నత్వమపీహ యాతి భగవద్భక్తేషు భక్త్యా తథా
సోఽయం సూరివరః శ్రియఃపతిసమో మూర్తిత్రితాభాసురః.

నమ్మాళ్వారులు భగవంతునకు సర్వదేశ సర్వకాల సర్వవిధ సేవలను చేయాలని ప్రార్థించే క్రమంలో లక్ష్మణునితో పోలికను కలిగి ఉన్నారు. ఆ విధంగానే,భగవంతుని విషయంలో పారతంత్ర్యభావనను కలిగి ఉండడంలో భరతునితో సామ్యాన్ని కలిగి ఉన్నారు. ఆ విధంగానే, భగవద్భక్తుల విషయంలో భక్తిని కలిగి ఉండడంచేత శత్రుఘ్న భావాన్ని పొందారు. ఈ మూడు విధాల రూపాలను సంతరించుకున్న నమ్మాళ్వారులు త్రిమూర్తుల రూపాన్ని పొందిన భగవంతునితో సమానంగా ప్రకాశిస్తున్నారు.

19) వ్యాఖ్యాయా మీడునామ్న్యాం శఠమథనకవేః సత్కృతే రంతిమాయాః
నంబిళ్ళైనామధేయో నిరుపధికరుణాపూర్ణ భవ్యాంతరంగః,
దివ్యానేతాన్ మహార్థాన్ వితరతి వివిధాన్ నిష్కలంకాన్ నిధీన్ నో
భక్త్యా తత్పాదరమ్యాంబుజ యుగవిషయా మాచరామో నమస్యామ్.

నమ్మాళ్వారులు కృప చేసిన చివరి ప్రబంధం అయిన తిరువాయ్ మొழி ప్రబంధానికి నంబిళ్ళై అనే మహాచార్యులు ఈడు అనే గొప్ప వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. అందులో సహజమైన కరుణను తమ హృదయంలో నిండుగా కలిగిన ఆ మహానుభావులు ఇటువంటి, చాలా గొప్పవి,ఏ దోషం లేనివి, అనేక విధాలైనవి అయిన అర్థాలను అనుగ్రహించారు. అటువంటి ఆ మహానుభావుల పాదపద్మ యుగ సన్నిధిలో భక్తితో నమస్కారాన్ని చేద్దాం.

20) వేదోఽయం ప్రభుసంమితో జనహితం చిత్తే సదా భావయన్
ఆజ్ఞారూపగిరం వదత్యనుపమాం కర్తవ్య ముద్బోధయన్,
తామేవాతులవత్సలత్వవివశః శ్రీమాన్ శఠారిః కవిః
మాతేవామృతసూక్తిభిః వివృణుతే స్వీయప్రబంధేషు నః.

వేదం ప్రభుసంమితం. అంటే రాజువంటిది. మనం చేయవలసిన కర్తవ్యాలను ఆజ్ఞారూపమైన వాక్యాలతో విధిస్తున్నది. ఈ వాక్యాలనే నమ్మాళ్వారులు , మన విషయంలో తమకు.ఉండే వాత్సల్యగుణం చేత వివశులై, అమృతంవంటి తీయని మాటలతో తమ ప్రబంధాలలో మనకు వివరిస్తున్నారు.

21) అంగిత్వం శఠకోపసూరికృతయో యాంతి, అంగభావం కలి–
ధ్వంసోక్తాః కృతయశ్చ షట్, తదిదముక్తం దేశికైః నః స్ఫుటమ్
ఏవం శిష్టసరోమహాదిమునిసంప్రోక్తాః ఉపాంగా ఇతి
ప్రోచు, శ్చాత్ర విశేషతో వివరణం విద్వన్ముఖాత్ శ్రూయతామ్.

నమ్మాళ్వారుల ప్రబంధాలు అంగి ప్రబంధాలు, అంటే, నాలుగు వేదాలతో సమానమైనవి. తిరుమంగై ఆళ్వార్ల ప్రబంధాలు 6 అంగ ప్రబంధాలు, అంటే, వేదాల అర్థాన్ని వివరించే షడంగాల వంటివి. దీనిని గూర్చి మన పూర్వాచార్యులు వివరించారు కూడా. ఇక, మిగిలిన పొయ్ గై అళ్వార్లు, పూదత్తాళ్వార్లు పేయాళ్వార్లు మొదలైన ఆళ్వారుల ప్రబంధాలు ఉపాంగాలు. ఈ విషయంలో విశేషమైన వివరణను పండితుల సన్నిధిలో గ్రహించాలి.

22) దృష్టాంతః కశ్చిదత్ర స్మృతిపథవిషయో నః సమింధే విశిష్టః
శ్రీవాగుక్తిప్రబంధే మడలితి మధురా ప్రక్రియా ప్రస్తుతా యా,
సైవ శ్రీమత్కలిఘ్నోదితకృతియుగళే విస్తృతిం ప్రాప్నువంతీ
సారజ్ఞాభిజ్ఞచిత్తే దిశతి నిరుపమాం నిర్వృతిం నిర్విఘాతామ్.

నమ్మాళ్వారుల ప్రబంధాలకు తిరుమంగై ఆళ్వారుల ప్రబంధాలు వివరణ రూపాలు అనే విషయంలో ఒక విలక్షణమైన ఉదాహరణ మన హృదయంలో ప్రకాశిస్తున్నది. అది ఏమంటే, నమ్మాళ్వారుల తిరువాయ్ మొళ్ధి ప్రబంధంలో మడల్ అనే ఒక విలక్షణమైన ద్రావిడాలంకారిక ప్రక్రియ ప్రస్తుతింపబడింది. ఈ ప్రక్రియే తిరుమంగై ఆళ్వార్ అనుగ్రహించిన శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్ అనే రెండు ప్రబంధాలలో విస్తృతిని పొంది, జ్ఞానులైన, సారజ్ఞులైన అభిజ్ఞుల చిత్తంలో సాటి లేని, ఏ అడ్డూ లేని మహానందాన్ని కలిగిస్తున్నది.

23) అత్రాద్యద్వికతః పరః సువిశదః, జీవః ద్వితీయద్వికే,
మోక్షోపాయవివేచనం తు విహితం సమ్యక్ తృతీయే ద్వికే,
ఏవం ప్రాప్యవిరోధి మోక్షవిశదీకారౌ తురీయే ద్వికే
చాంత్యేఽత్ర క్రమశో భవేదితి మతం శ్రీవాదిసింహోదితమ్.

తిరువాయ్ మొళ్ధి ప్రబంధంలోని పది దశకాలు ఏ యే అర్థాలను నిరూపిస్తున్నాయి అనే విషయంలో పలువురు పూర్వాచార్యులు పలు విధాలుగా భావన చేశారు. వాది కేసరి అనే పేరు కలిగిన అళకియ మణవాళ చ్చీయర్ అనే ఆచార్యులు పన్నీరాయిరప్పడి అనే వ్యాఖ్యానంలో తిరువాయ్ మొళ్ధి ప్రబంధంలోని మొదటి రెండు దశకాలు పరస్వరూపాన్ని, తరువాతి రెండు దశకాలు జీవ స్వరూపాన్ని, ఐదవ, ఆరవ దశకాలు మోక్షోపాయ స్వరూపాన్ని, ఏడవ ఎనిమిదవ దశకాలు విరోధి స్వరూపాన్ని, చివరి రెండు దశకాలు మోక్షప్రాప్తి రూపమైన ఫలస్వరూపాన్ని విశదం

చేస్తున్నాయి అని తెలియజేశారు. ఈ విధంగా ఈ ప్రబంధం అర్థ పంచక వివరణమని వారి భావన.

24)పరత్వం ప్రథమం ప్రోక్తం
కారణత్వం ద్వితీయకే
వ్యాపకత్వం తృతీయే చ
నియంతృత్వం తురీయకే

25)తథా కారుణికత్వాఖ్యం
పంచమే సముదీరితమ్
షష్ఠేఽపి చ శరణ్యత్వం
శక్తత్వం సప్తమే తథా

26) అష్టమే సత్యకామత్వం
విశదీకృత మద్భుతమ్,
ఆపత్సఖత్వ ముదితం
నవమే హృదయంగమమ్,

27) అంతిమే చార్తిహరతా
సద్గుణః ప్రతిపాదితః
శఠకోపసహస్రాఖ్య
ప్రబంధశతకేష్వయమ్,

28) గుణక్రమో భావనీయో
రసజ్ఞైః గుణలోలుపైః.
ఇత్యాచార్యహృదాఖ్యాత
సద్గ్రంథే సముదీరితః,

29) నాయనారితి సన్నామ్నా
విశ్రుతైః విదుషాంవరైః
ప్రోక్తం మతమిదం భవ్య
మింధే బహుమతం విదామ్.

నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొழి ప్రబంధంలోని 10 శతకాలలో ఈ క్రింది విధంగా భగవంతుని పది గుణాలు క్రమంగా నిరూపింప బడ్డాయి అని అழకియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనే ఆచార్యులు ఆచార్య హృదయం అనే గ్రంథంలో తెలియజేశారు. మొదటి శతకంలో పరత్వం, రెండవ శతకం కారణత్వం, మూడవ శతకం వ్యాపకత్వం, నాలుగవ శతకంలో నియంతృత్వం. ఐదవ శతకంలో కారుణికత్వం, ఆరవ శతకంలో శరణ్యత్వం, ఏడవ శతకంలో శక్తత్వం, ఎనిమిదవ శతకంలో సత్యకామత్వం, తొమ్మిదవ శతకంలో ఆపత్సఖత్వం, చివరి శతకం శతకంలో ఆర్తిహరత్వం అనే గుణాలు వర్ణింప బడ్డాయి అని వీరి అభిప్రాయం. వీరి ఈ మతం పండితులకు చాలా అభిమతం.

31) ప్రత్యాహారనయే యదీహ పదసంయోగో భవేత్, లభ్యతే
కశ్చిత్ శాస్త్రరహస్యరమ్యవిషయః జ్ఞేయశ్చ మోక్షార్థిభిః,
యో భాతీహ పరః స ఏవ హి హరత్యస్మాక మార్తిం భవే,
స స్యాదాపది నః సఖేతి చ పరం తత్త్వం విభాతీహ నః.

ఇక్కడ చెప్పబడిన గుణాల క్రమాన్ని పరిశీలిస్తే ఒక అద్భుతమైన రహస్యం దాగి ఉంది. అది ఏమంటే, "యః పరః స ఏవ జగత్కారణం, స ఏవ సర్వవ్యాపకః,....యః పరః స ఏవ ఆర్తిహరః, స ఏవ ఆపది సఖా"—ఎవరైతే అందరి కంటే పరుడో అతడే జగత్కారణం, అతడే సర్వవ్యాపకుడు,.... అతడే ఆర్తి హరుడు, అతడే ఆపత్సఖుడు అనే విశిష్టమైన తత్వం ప్రత్యాహార న్యాయంలో మొదటి పదాన్ని వరుసగా తరవాత ఉండే పదాలతో కలుపుకొని అర్థం చెప్పుకుంటే భాసిస్తుందికదా.

32) తాత్పర్యం మంత్రరాజే ప్రతిఫలతి కృతా వంతిమాయాం శఠారే
ఇత్యాహుః దేశికా స్తద్గతసకలవిశేషార్థ తత్త్వప్రవీణాః,
ఏవం శ్రీకృష్ణమూర్త్యుదితవరచరమశ్లోకతతత్త్వం చ సర్వం
భాత్యేవాస్మిన్ ప్రబంధే, తదపి సువివృతం టీకనేష్వస్మదార్యైః.

మంత్రరాజంగా చెప్పబడే అష్టాక్షరీ మహామంత్రంలోని తాత్పర్యం నమ్మాళ్వార్ల చివరి ప్రబంధం అయిన తిరువాయ్ మొழிలో ప్రకాశిస్తున్నది అని ఆ ప్రబంధంలోని తత్వాలను చక్కగా అర్థం చేసికొన్న, సమర్థులైన పూర్వాచార్యుల అభిప్రాయం. ఆ విధంగానే, శ్రీకృష్ణుడు పలికిన, భగవద్గీతలోని చరమ శ్లోకంలోని అర్థం కూడా ఇందులో ప్రకాశిస్తున్నది అనే విషయాన్ని మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో చక్కగా విశదం చేశారు.

33) ఇష్టో వ్యాస స్సమాసశ్చ సదసి విదుషాం, తత్క్రమోఽప్యత్ర లక్ష్యః
శ్రీవాగుక్తిప్రబంధే స్ఫుటతరవిధయేత్యస్మదాచార్యసూక్తిః,
ఆద్యాయాః గీతికాయాః వివృతిరిహ భవేత్ స ప్రబంధోఽపి పూర్ణః,
తస్యాపి స్యాత్ సమాసః ప్రథమశతకమిత్యత్ర చిత్రక్రమోఽయమ్.

"ఇష్టం హి విదుషాం లోకే సమాసవ్యాసధారణమ్" అనే విధంగా విద్వాంసుల గోష్ఠిలో ఒక విషయాన్ని సంగ్రహంగా ముందు చెప్పి, తరువాత దానిని వివరించడం అనేది ఒక క్రమం. ఇది విలక్షణమైనది. ఈ క్రమాన్ని మనం తిరువాయ్ మొళ్ళి ప్రబంధంలో చూడవచ్చు అని మన పూర్వాచార్యుల అభిప్రాయం. ఏ విధంగా అంటే, తిరువాయ్ మొళ్ళి ప్రబంధంలోని మొదటి పాశురానికి వివరణమే మొత్తం ప్రబంధం అంతా. మొత్తం ప్రబంధానికి సంగ్రహరూపం మొదటి శతకం. ఈ విధంగా ఉండే. ఆశ్చర్యకరమైన క్రమం ఈ ప్రబంధంలో కనిపిస్తున్నది.

34) శ్రీవాగుక్తిప్రబంధం సునిశితమతయః దేశికాః పంచ దివ్యైః
వ్యాఖ్యానైః స్వైః మహద్భిః నిరతిశయరుచిం కల్పయంతి స్మ భవ్యామ్,
కింత్వాస్తే కాచిదీడ్వితిసువిదిత సంపూర్ణటీకాఽభిరామా
కాంతేవాభిజ్ఞచిత్తే ప్రజనయతి ముదం నైకరస్యోక్తిజాలైః.

నమ్మాళ్వారుల తిరువాయ్ మొళ్ళి ప్రబంధానికి చాలా నిశితమైన బుద్ధిని కల ఐదుగురు పూర్వాచార్యులు తమ గొప్ప గొప్ప వ్యాఖ్యానాలతో ఆ ప్రబంధం అపూర్వమైన అందాన్ని కలుగజేశారు. కానీ వాటిలో ఈడు అనే వ్యాఖ్య మనోహరమైనది. అనేక రస్య వివరణలతో అభిజ్ఞుల హృదయాలను, అందమైన కాంత తన రస్యమైన వచనాలతో రసజ్ఞులను వలె, ఆకర్షిస్తున్నది.

35) నైకే నో గురవః శఠారికవిరాట్ గాథాసహస్రోదితాః
సూక్తీః స్వీయవిశిష్టవాగ్వివృతిభిః సంశోభితాః చక్రిరే,
తాసు శ్రీయతిశేఖరస్య వివృతేః కల్పోఽతిశేతే పరాః
సర్వాః వ్యాకరణక్రమైః ప్రకరణౌచిత్యాద్విదాం సంమతైః.

తిరువాయ్ మొళ్ళి ప్రబంధంలోని సూక్తులకు మన పూర్వాచార్యులు చాలామంది తన చక్కని వివరణలతో ఆ సూక్తులకు శోభను కలుగజేశారు, కానీ,

భగవద్రామానుజులు చేసిన అర్థ నిర్వాహాలు ప్రత్యేకించి ఆయా సందర్భాలకు తగినట్లు ఉండడంచేత అవి మిగిలినవారు చేసిన వివరణల కంటే విశిష్టమైనవి కనుక, పండితుల మనసులను రంజింపజేసేవి.

36) ఏవం చేదితరార్యటీకనవిధౌ స్యాన్న్యూనతాభావనే–
త్యుద్భూయాదిహ సంశయో మనసి నో జిజ్ఞాసయా కశ్చన,
వాచ్యః సాధుసమాధి రత్ర న హి నిందేత్యాదిసమ్యఙ్నయే,
శ్రీరామానుజవైభవప్రకటనే తాత్పర్యమేవాధునా.

ఇక్కడ ఒక జిజ్ఞాసు సందేహం కలుగవచ్చు. ఈ విధంగా భగవద్రామానుజులు చెప్పిన అర్థాలు మిగిలినవారి వివరణల కంటే అందంగా ఉన్నాయి అని అంటే. మిగిలిన ఆచార్యుల వివరణలకు తక్కువదనం చెప్పినట్టే కదా అనేది ఆ సందేహం. ఈ సందేహానికి తగిన సమాధానాన్ని ఈ విధంగా చెప్పుకోవచ్చు. శాస్త్రంలో "న హి నిందాన్యాయం"అని ఒకటి ఉన్నది. ఒకరిని గురించి గొప్పగా చెప్పినప్పుడు ఆ మాట వారిని పొగడడంలోనే తాత్పర్యాన్ని కలిగి ఉంటుంది తప్ప ,మిగిలినవారిని తక్కువ చేయడంలో ఉద్దేశ్యాన్ని కలిగి ఉండదు అని దీని భావం. ఆ విధంగానే ఇక్కడ కూడా శ్రీరామానుజుల గొప్పతనాన్ని చెప్పడంలోనే భావం తప్ప, మిగిలిన పూర్వాచార్యులను తక్కువ చేయడంలో అభిప్రాయం లేదు అని గ్రహించాలి.

37) శ్రీవాగుక్తికృతౌ కథం చ చరమశ్లోకార్థభానం భవేత్?
ప్రోచు శ్చాత్ర గురూత్తమాః సుమధురం కంచిత్ విశిష్టం క్రమమ్,
తత్రాద్యం శతషట్కతః సువివృతం పూర్వార్థవేద్యం, తతః
పశ్చాదుత్తరభాగవేద్యవివృతిః శిష్టైః చతుర్భిః శతైః.

నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలో మొదటి శతకం ద్వారా పరత్వాన్ని, రెండవ శతకం ద్వారా పరత్వాన్ని నిరూపించే కారణత్వాన్ని, మూడవ శతకం ద్వారా కారణత్వం వల్ల దోషం కలవాడు అవుతాడేమో? అనే సందేహాన్ని తీర్చడం కోసం వ్యాపకత్వాన్ని, నాలుగవ శతకం ద్వారా ఆ వ్యాప్తి ప్రకాశించడం కోసం నియంతృత్వాన్ని తెలియజేసి, భగవంతుడే పరుడు అని తెలియజేశారు. ఐదవ శతకం ద్వారా అతడు కరుణ కలిగినవాడు కనుక పరమ సులభుడు అని అన్నారు. ఆరవ శతకంలో పరత్వం, సౌలభ్యం అనే రెండు గుణాలతో నిండిన భగవంతుని విషయంలో పరిపూర్ణమైన శరణాగతిని చేశారు. ఈ విధంగా మొదటి ఆరు శతకాలు చరమ శ్లోకంలోని మొదటి భాగాన్ని వివరిస్తున్నవి.

ఏడవ శతకం ద్వారా అతడు భగవంతుని శక్తత్వం తెలుపబడినందున, 8వ శతకం ద్వారా అతడు సత్యకాముడు అని చెప్పబడడంచేత, తొమ్మిదవ శతకంలో అతడు ఆప్త సఖుడు అని చెప్పబడినందున, చివరి శతకంలో అతడు ఆర్తి హరుడు అని చెప్పబడడంచేత, విరోధులను అతడు పోగొట్టగలిగే సర్వశక్తి, పురుషార్థాలను ఇవ్వగలిగే సత్యకాముడు, విరోధులను పోగొట్టగలిగే ఆర్తి హరుడు అని అన్నారు. ఇది చరమశ్లోకంలోని రెండవ సగంలో కల అర్థాన్ని వివరిస్తున్నది. చరమ శ్లోకంలోని "అహం" అనే పదం ద్వారా శక్తత్వం, సత్యకామత్వం, ఆప్తసఖత్వం అనేవి, "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి",అని అనడంవల్ల ఆర్తిహరత్వం చెప్పబడ్డాయి కదా.

38) పత్యుః లక్ష్మ్యాః స్వరూపం "నలముడయవని"త్యాదినా సమ్యగుక్తం,
స్పష్టం చాత్మా తథా "ఎన్ మనని" తిపదతః శేషభూతః పరస్య,
మోక్షోపాయ స్తథైవా"రుళిన"నితి, "మయర్వు"ప్రయోగాద్విరోధిః,
ప్రాప్యం సంసూచ్యతేంఽతే "తొళుదెళు"పదతః శ్రీముఖేఽత్రాఽఽద్యగీతే.

తిరువాయ్ మొழி ప్రబంధంలో మొదటి పాశురంలోనే అర్థపంచకం చెప్పబడింది. ఏ విధంగా? అంటే, "నల ముడైయవన్" అని సకలకల్యాణ గుణాలను కల పరమాత్మ స్వరూపం, "ఎన్ మననే" అనే సర్వనామ శబ్దం ప్రయోగించడం చేత జీవస్వరూపం, "అరుళినన్" అని నిర్హేతుకకరుణను సూచించే పదం ప్రయోగించడం చేత ఉపాయం, "మయర్వు" అని అజ్ఞానాన్ని చెప్పే పదం ద్వారా విరోధి స్వరూపం, చివరిగా, "తొழுదెழு" అని అనడం చేత భగవంతుని కైంకర్యం అనే ప్రాప్య స్వరూపం తెలుపబడ్డాయి అని గ్రహించాలి.

39) అష్టాక్షర్యుదితః కథం వకుళభృత్ దివ్యప్రబంధేஉతిమే
భావో వ్యజ్యత ఇత్యముత్ర విహితే ప్రశ్నే, సమాధి స్త్వియమ్.
తారో భాతి సఖీగిరా మధురయా,మాతుః గిరా మధ్యమః
శబ్దో భాత్యపి నాయికావచనత శ్చేంధే తృతీయం పదమ్.

నమ్మాళ్వారుల చివరి ప్రబంధం అయిన తిరువాయ్ మొழிలో అష్టాక్షరీ మంత్రంలోని మూడు పదాల తాత్పర్యం ఏ విధంగా ప్రకాశిస్తున్నది? అని అడిగితే, ఇది సమాధానం. ఈ ప్రబంధంలో కనిపించే, "భగవంతునకు మాత్రమే ఈ ఆత్మ చెందినది"అనే అర్థాన్ని తెలియజేసే చెలికత్తె మాటల ద్వారా ప్రణవార్థం, "భగవంతుడే ఉపాయం, ఆయన వచ్చే వరకు వేచి ఉండాలి" అనే అర్థాన్ని తెలిపే, నాయిక తల్లి పలికే మాటల ద్వారా నమః శబ్దంలోని అర్థం, "భగవంతుని వెంటనే సేవించాలి" అనే తొందరను సూచించే, నాయిక పలికే మాటల ద్వారా చివరి పదంలోని అర్థం సూచింపబడ్డాయి.

40) భవ్యా ద్రావిడకావ్యశాస్త్రవిదితాః నానామలప్రక్రియాః
భాసంతే శఠమర్షణాఖ్యకవిరాట్ గాథాసహస్రోదితాః
ఏతాః శ్రీపతిదివ్యవైభవపరా సంప్రాప్నువంత్యః పరం
సార్థక్యం, శ్రుతిశీర్షకేషుకథితా నర్థాన్ వదంత్యద్భుతాన్.

తిరువాయ్ మొழி ప్రబంధంలో ఎన్నో ద్రావిడభాషాలంకార రీతులు మనకు కనిపిస్తాయి. మడల్ ఎత్తడం, సోది చెప్పడం, నాయకుని దగ్గరకు దూతలను పంపించడం మొదలైన ఎన్నో అలంకార రీతులు మనకి కనిపిస్తాయి. ఇదే కాక" వెళివిలక్కు", "వరైవు కడాదల్" మొదలైన చాలా విశిష్టమైన రీతులు కూడా ఉన్నాయి. ఇవి అన్ని భగవంతుని వైభవాన్ని ప్రకాశింప చేయడంలో తాత్పర్యం కలిగినవి. అందుచేత సార్థకం అవుతున్నాయి. ఇంతే కాదు, వీటి ద్వారా నమ్మాళ్వారులు మనకు ఎన్నో అద్భుతాలైన వేదాంతార్థాలను "గుడజిహ్వికాన్యాయం"లో తెలియజేశారుకూడా.

41) శ్రీమద్గీతిసహస్రవత్ససవితా శ్రీమచ్ఛఠారిః కవిః
తత్సర్వాంగసమగ్రరక్షణవిధౌ దక్షో యతీంద్రో గురు
తస్యాలంకృతిసాధనే తు కుశలః నంబిళ్ళైనామా మహాన్
నిత్యం భక్తిరసప్రపూర్ణహృదయో తేభ్యో నమః కుర్మహే.

వేయి పాశురాలను కల తిరువాయ్ మొழி ప్రబంధం అనే బిడ్డను కన్నవారు –నమ్మాళ్వారులు. ఆ బిడ్డకు సర్వాంగీణమైన రక్షణ కల్పించడంలో సమర్థులు– భగవద్రామానుజులు. అతనికి అందం కలుగజేసే అలంకారాలను సంపాదించడంలో సమర్థులు– నంబిళ్ళై అనే మహానుభావులు. ఈ ముగ్గురికి భక్తి నిండిన హృదయంతో నమస్కరిద్దాం.

42) సర్వాభిః.గీతికాభిః శఠహరసుకవేః స్తూయతే దివ్యకీర్తిః
దివ్యారామావృతానుపమవిభవయుక్ రంగనాథస్య శుభ్రా,
ఇత్యేనాం భట్టపాదాహ్వయగురుకథితోక్తిం హృదా భావయంతః
కుర్వంతో ఽస్మై ప్రణామాః ప్రణిహితమనసో ధన్యధన్యా భవామః.

నమ్మాళ్వారుల తిరువాయ్ మొழிప్రబంధంలోని పాశురాలు అన్నీ అందమైన ఉద్యానవనాలను చుట్టూ కలిగిన శ్రీరంగానికి అధిపతి అయిన రంగనాథుని కీర్తిని పొగడుతున్నాయి అని శ్రీపరాశర భట్టర్ తెలియజేశారు. ఇటువంటి సూక్తిని, దీనిని అనుగ్రహించిన పరాశర భట్టర్ అనే ఈ ఆచార్యులకు భక్తిపూర్వకంగా ప్రణామాలు సమర్పించి ధన్యులం అవుదాం.

43) శ్రీమన్మంత్రమణౌ దళద్వయగతం భావం శఠారికవిః
శ్రీమద్వేంకటనాయకస్య విషయత్వేనావదత్ భక్తితః ,
శ్రీవాగుక్తిసమాఖ్యకే కృతివరే, తస్మాదయం భాసతే
తద్దేవాతులవైభవాత్మక ఇతి ప్రోచుశ్చ కేచిద్విదః.

మంత్రరత్నంగా చెప్పబడే ద్వయమంత్రంలోని రెండు వాక్యాలలో భాసించే అర్థాలను నమ్మాళ్వారులు శ్రీవేంకటేశ్వరుని విషయంగా తిరువాయ్ మొழி ప్రబంధంలో అనుసంధానం చేశారు. అందుచేత ఆ ప్రబంధం మొత్తం శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని కీర్తిస్తున్నదని కొందరు పండితుల అభిప్రాయం.

ఈ అభిప్రాయాన్ని భగవద్విషయ తనియన్ పాశురాను వ్యాఖ్యానిస్తూ. పిళ్ళైలోకమ్ జీయర్ అనే పూర్వాచార్యులు తెలిపారు.

44) తత్త్వావిష్కరణం శఠఘ్నకవినా ద్వేధా కృతం ద్యోతతే
యత్రాన్యోక్తిముఖక్రమః స కథితోఽన్యాపదేశాత్మకః,
యత్ర స్వస్య గిరా కృతః స తు భవేచ్ఛ స్వాపదేశాభిధః
భవ్యోఽభిజ్ఞమనోహరక్రమయుగాయాస్మై నమస్కుర్మహే.

నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలో తత్త్వార్థాలను ఆవిష్కరించే క్రమంలో రెండు విధాలైన పద్ధతులను అనుసరించారు. అవి, స్వాపదేశ క్రమం,

అన్యాపదేశ క్రమం అనేవి. అపదేశం అంటే నెపం అని అర్థం. తాము నేరుగా పలికే మాటల ద్వారా విషయాన్ని తెలియజేసే క్రమానికి స్వాపదేశక్రమం అని పేరు. ఇతరుల మాటలద్వారా అర్థాలను తెలిపే క్రమానికి అన్యాపదేశమని పేరు. పరాంకుశ నాయకిగా ,ఆమె తల్లిగా, ఆమె చెలికత్తెగా మాట్లాడే క్రమం ఇటువంటిది. అందమైన, రసజ్ఞులను మెప్పించే ఈ రెండు క్రమాలకు నమస్కారం చేద్దాం.

45) శృంగారాత్మకవర్ణనం తు విమలే భక్తిప్రబంధే కథం
యుజ్యేతేతి బలీయసీ భవతి నో శంకాంతరంగే భవేత్,
భక్తి శ్చాత్ర ముకుందపాదయుగళీసంసేవనే కామనా
సా శృంగారరసాత్మనా పరిణతిం యాత్యంతతో హ్యుత్తమామ్.

"తిరువాయ్ మొழி ప్రబంధం భక్తిప్రబంధం కదా. అందులో శృంగార రసం వ్యక్తం చేసే వర్ణనలు, వచనాలు ఉండడం ఏ విధంగా యుక్తం? "అనే ఒక బలమైన సందేహం మన మనసులో కలుగుతుంది,నిజం. భగవంతుని చరణాల విషయంలో ఉండే భక్తి అనేది ఉత్తమమైన దశను పొందినప్పుడు, ఆ దశలో శృంగార రసంగా పరిణమిస్తుంది.

46) కామోఽయం మధుహారిపాదవిషయే శాస్త్రేణ వేదాత్మనా
మంతవ్యో భగవాన్ హృదేతి బహుధా నిర్దిశ్యతే, శ్రూయతామ్,
తేనాయం పరమః పుమర్థ ఇతి నః సుస్పష్టతో జ్ఞాయతే
తత్ సందేహలవాంశమాత్రమపి సంజాయేత చిత్తే విదామ్.

భగవంతుని చరణాల విషయంలో ఉండే కామాన్ని శాస్త్రరూపమైన వేదమే స్వయంగా "శ్రోతవ్యో మంతవ్యః" అని పలుమార్లు విధించింది. ఆ వేద వాక్యాలను వినండి. అందుచేత భగవంతుని విషయంలో కామం పరమ పురుషార్థం అని మనకు స్పష్టంగా తెలుస్తున్నది. కనుక ఈ విషయంలో సందేహానికి కొంచెం కూడా అవకాశం లేదు.

47) తారాధిష్ఠితమధ్యమాక్షరవశాదీశాత్మనోః సంగతిః
సా పత్నీపతిబంధనేన సదృశీ భాతీతి విజ్ఞాయతే,
సైవ స్యాదిహ కారణం శఠజితః శృంగారసంభావనే
శ్రీవాగుక్తికృతా వితి ప్రవదతా మింధే మతం ధీమతామ్.

ప్రణవంలో ఉండే మధ్యమాక్షరం అయిన ఉకారం ద్వారా జీవేశ్వరుల మధ్య ఉండే సంబంధం భార్యాభర్తల సంబంధంవంటిది అని తెలుస్తున్నది. ఈ సంబంధమే నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలో శృంగారరసాత్మకంగా పాశురాలను పాడడంలో కారణమని పలికే పండితుల మతం గొప్పగా ప్రకాశిస్తున్నది.

48) వేదైః వేద్యోఽస్మి సర్వైరహమితి భగవానుక్తవాన్ గీతికాయాం
పత్యుః లక్ష్మ్యాః పరత్వం వకుళధరమునిః శ్రీముఖాఖ్యప్రబంధే
వ్యక్తీచక్రే మనోహృత్సుమధురవచనైః నైకరూపై రనేకైః
తస్మాత్ వేదార్థసారో లసతి శఠజితో గీతికానాం సహస్రమ్.

"వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః" —వేదాలన్నిటిచేత నేనే తెలియబడుతున్నాను" —అని భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు అన్నాడు.ఆ వేదార్థసారమైన శ్రీమన్నారాయణ పరత్వాన్ని తిరువాయ్ మొழி ప్రబంధంలో మనోహరమైన, తీయని సూక్తులతో నమ్మాళ్వారులు వ్యక్తం చేశారు. అందుచేత ఆ ప్రబంధం వేదార్థసారం అని చెప్పదగినది

49) శ్రీవాగుక్తిప్రబంధాద్య దశకయుగళీ వక్తి శారీరకాఖ్యే
శాస్త్రే ప్రోక్తం సదర్థం సదృశతరశుభైః తాదృశైః వాక్ప్రయోగైః,
కాంచీవాసాశ్చ రామావరజయతివరాః కేచిదేనం వివవ్రుః.
కస్మింశ్చిత్ గ్రంథరత్నే శ్రుతియుగళరహస్యార్థ సర్వస్వభూతే.

తిరువాయ్ మొழி ప్రబంధంలోని మొదటి రెండు దశకాలు శారీరక మీమాంసా శాస్త్రప్రమేయాన్ని తగిన,ఆయా పద ప్రయోగాల ద్వారా సంగ్రహంగా తెలుపుతున్నాయి. కాంచి నగరంలో నివసించినవారు ,రామానుజయతి అనేక పేరు కలిగిన మహనీయులు ఒకరు ఈ ఉభయ వేదాంతార్థసామ్యాన్ని ఒక చక్కని గ్రంథంలో తెలియజేశారు.

దీనిని పెద్ద భగవద్విషయ శ్రీకోశంలో "వీడుమిన్" అనే రెండవ దశక వ్యాఖ్యానం తరువాత చూడవచ్చు.

50) ద్వాత్రింశత్ బ్రహ్మవిద్యా అపి వకుళధరస్యాత్ర దివ్యప్రబంధే
భాభాంత్యేవేతి సంతః శ్రుతియుగళవిదః ప్రబ్రువాణో జయంతి,
ఆద్యే పద్యేఽత్ర లక్ష్యా హి నిగమకథితన్యాసవిద్యాఽనవద్యా
సేయం రీతిః సుభావ్యేహ బుధజనవరైః సూక్ష్మదృష్ట్యాఽభివీక్ష్య.

తిరువాయ్ మొழி ప్రబంధంలో 32 బ్రహ్మ విద్యలు చక్కగా ప్రకాశిస్తున్నాయి అని పలికే మహాత్ములైన ఉభయ వేదాంతార్థ పండితులు గొప్పగా ప్రకాశిస్తున్నారు. ఈ ప్రబంధంలోని మొదటి పాశురంలోనే ఉపనిషత్తులలో ప్రసిద్ధమైనది, గొప్పది అయిన న్యాసవిద్య ప్రతిపాదించబడింది. న్యాసం అంటే ప్రపత్తి. ఇటువంటి సూక్ష్మదృష్టిలో పండితులు గమనించి ఈ విద్యలను గుర్తించాలి.

51)గీతాఽద్యా శ్రీముఖోక్తా ప్రవిలసతి విశిష్టాద్వైతసిద్ధాంతసారః.
పాదే త్వాద్యే స్వరూపం, సకలశుభగుణా ఇందిరాయాశ్చ నేతుః
తార్తీయీకే చ పాదేఽమరపతిపదతః సూచితా నిత్యభూతిః,
పాదేంఽత్యే దివ్యరూపం కథితమపి తథోక్తా చ లీలావిభూతిః.

తిరువాయ్ మొழி ప్రబంధంలో మొదటి పాశురం విశిష్టాద్వైత సిద్ధాంతసారం అని చెప్పవచ్చు. మొదటి పాదంలో "నలముడైయవన్" అని అనడం ద్వారా భగవంతుని ఆనందమయస్వరూపం, ఆ విధంగా  సకల కళ్యాణగుణాలు చెప్పబడ్డాయి. మూడవ పాదంలో "అమరర్ కళ్ అదిపతి" అనడం వల్ల నిత్యవిభూతి చెప్పబడింది. నాలుగవ పాదంలో "శుడరడి" అనే పదం ద్వారా దివ్యమంగళ రూపం చెప్పబడ్డ డంతో పాటు, నమ్మాళ్వారులు వేంచేసి ఉండే లీలావిభూతి ప్రస్తావనకూడా చేయబడింది.ఈ విధంగా స్వరూప రూప గుణవిభూతుల ప్రస్తావన ఈ మొదటి పాశురంలో ఉన్నది కనుక ఈ పాశురం విశిష్టాద్వైత సిద్ధాంత సారం అని చెప్పవచ్చు.

52) పాళ్యారోహణ రోషభాషణముఖాః యే లౌకికాః ప్రక్రియాః
శ్రీవాగుక్తికృతౌ శఠారికవినా సమ్యక్ ప్రయుక్తా ఇహ,
తై స్సర్వై రుదితా త్వరా భగవతః ప్రత్యక్షసందర్శనే
కైంకర్యే చ తథైవ తచ్చరణయోః యా ప్రార్థనీయా సదా.

నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలో పాళిసమారోహం, అంటే– మడల్ ఎత్తడం, నాయికా నాయకుని చూచి రోషంగా మాట్లాడడం మొదలైన లోకంలో ఉండే ఏ ఏ ప్రక్రియలు ఉన్నాయో, వానిని చక్కగా ప్రయోగించారు. ఇవి అన్ని భగవంతుని నేరుగా దర్శించడంలోను, ఆ స్వామి పాదాలకు కైంకర్యం చేసికోవడంలోను భక్తులకు ఉండే తొందరను తెలుపుతాయి. ఈ తొందర తప్పక ప్రార్థించదగినది.

53) యే దూతాః పికహంసషట్పదముఖాః సందృశ్యమానా ఇహ
తే శ్రీయాముననాథ లక్ష్మణమునీంద్రాద్యా హి నో దేశికాః,
తత్ర శ్రీయతిరాడ్వరాః భ్రమరసంవేద్యా ,తథా యామునాః
భావ్యా హంసపదప్రయోగవశతశ్చేత్యుచ్యతే విత్తమైః.

తిరువాయ్ మొழி ప్రబంధంలో దూతలుగా హంసలు, కోకిలలు, తుమ్మెదలు మొదలైన పక్షులు కనిపిస్తాయి. ఇవి అన్ని సామాన్యమైన పక్షులు కావు. ఇవి మన పూర్వాచార్యులను. నిర్దేశిస్తాయి. ఆ యా విశేషాలను బట్టి తుమ్మెదను భగవద్రామానుజులుగా, హంసను భగవద్యామునులుగా భావించాలి అని పండితుల అభిప్రాయం

.

54) పక్షాభ్యాం విచరంతి ఖే హి పతగా ఏవం చరంత్యచ్యుతే
కర్మజ్ఞానవిలక్షణచ్ఛదయుగాః వ్యోమ్న్యస్మదార్యా స్సదా,
తత్తే పక్షిసమా ఇతీహ శఠజిత్కావ్యేఽభిరామే పదైః
హంసాద్యైః ధ్వనిలక్షితా ఇతి మహాంతో నాయనారాఖ్యకాః

పక్షులు ఆకాశంలో తమ రెండు రెక్కలతో ఎగురుతాయి. ఆ విధంగానే, మన ఆచార్యులు అనే పక్షులు జ్ఞానం, కర్మ అనే రెండు విలక్షణమైన రెక్కలతో భగవంతుడనే ఆకాశంలో సంచరిస్తారు. అందుచేత వీరు పక్షులతో సమానులు కాబట్టి, నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధంలో హంస మొదలైన పదాలద్వారా వారు ధ్వని క్రమంలో నిర్దేశింపబడ్డారు ఆచార్య హృదయం అనే గ్రంథంలో నాయనార్ అనే మహనీయులు తెలియజేశారు.

55) ఏవం కేశ వలగ్న నేత్రముఖనిర్దేశోఽపి వేద్యో భవేత్
ధ్వన్యర్థక్రమతో, న లౌకికవిధా విత్యత్ర నో దేశికాః,
తత్రాక్షిద్వయలక్షితం భవతి హి జ్ఞానం, తథా ధ్వన్యతే
వ్యామోహోఽపి కచోక్తితో భగవతి స్యా దేవ మన్యేష్వపి.

ఈ విధంగానే,తిరువాయ్ మొழி ప్రబంధంలో కేశాల వర్ణన,నేత్రాల వర్ణన, ముఖ వర్ణన, కుచ వర్ణన మొదలైన పలు లౌకిక వర్ణనలు కనిపిస్తాయి. వీటిని అన్నిటినీ ధ్వని ప్రక్రియలో అర్థం చేసుకోవాలి. అంతే తప్ప, లౌకిక రీతిలో అర్థాన్ని గ్రహించకూడదు. ఉదాహరణకు,.నేత్ర వర్ణన వల్ల జ్ఞానం చెప్పబడుతుంది. కేశవర్ణన వల్ల భగవంతుని

విషయంలో వ్యామోహం చెప్పబడుతుంది. ఈ విధంగానే మిగిలిన వర్ణనల విషయంలో కూడా భావించాలి.

56) తత్తద్విద్యాసు తే తే శుభరుచిరగుణాః బ్రహ్మణో భాంతి యద్వత్
శ్రీశస్యార్చాస్వపీత్థం కతిచన సుగుణాః యాంతి భానం విశిష్య,
అస్మిన్ భవ్యక్రమేఽత్ర స్ఫురతి వనగిరే రీశ్వరే రాశ్రితేషు
వ్యామోహో, వత్సలత్వం కసతి చ వృషశైలాధిపే ప్రస్ఫుటం నః.

ఆయా బ్రహ్మవిద్యలో కొన్ని కొన్ని పరమాత్మయొక్క కళ్యాణ గుణాలు విశేషంగా ప్రకాశించేటట్లు, భగవంతుని అర్చామూర్తులలో కూడా ఆ విధంగానే కొన్ని కళ్యాణగుణాలు విశేషంగా ప్రకాశిస్తాయి. ఈ క్రమంలో దర్శించినపుడు, వనగిరి అనబడే తిరుమాలిరుం శోలై క్షేత్రంలో ఉండే స్వామిలో భక్తవ్యామోహం, వేంకటాచలంలో ఉండే శ్రీనివాసునిలో భక్తవాత్సల్యం అనే గుణాలు గొప్పగా ప్రకాశిస్తున్నాయి.

57) సాధూనాం పరిరక్షణం ఖలజనోన్మూల స్తథా స్థాపనం
ధర్మస్యేతి నిరుచ్యతేఽవతరణార్థో హి త్రిధా శ్రీపతేః.
గోవిందప్రణుతేః శఠోక్తిమథనాత్ న్యాసప్రబోధేన చ
శ్రీవాగుక్తికృతిః విభాతి బహుధా శ్రీశావతారోపమా.

సాధుపరిత్రాణం, దుష్టశిక్షణం, ధర్మసంస్థాపనం అని మూడు విధాలుగా భగవంతుని అవతారప్రయోజనాలు నిరూపింపబడినవి. ఈ మూడు తిరువాయ్ మొழி ప్రబంధంలో మనకు గోచరిస్తాయి. సౌలభ్యం మొదలైన భగవంతుని గుణాల కీర్తనం వల్ల సాధువుల ఆర్తి తీరింది. ఇందువల్ల వారి పరిరక్షణ జరిగింది. ఆ ప్రబంధంలో పలుచోట్ల నాస్తికవాదాలు నిరసింపబడినందున దుర్జన శిక్షణ జరిగింది. ప్రపత్తి ప్రబోధింపబడడం చేత ధర్మసంస్థాపన కూడా జరిగింది. ప్రపత్తి గొప్ప ధర్మమే కదా.

58) కశ్చిత్ స్వాతిశయం యది ప్రకటయేత్ ప్రాధాన్య మేతద్గిరాం
నైవ స్యాత్, యది కీర్త్యతే పరజనైః స స్యాత్.ప్రమాణం తతః,
గీతాత్ కృష్ణముఖోద్గతాత్ శఠరిపుప్రోక్తోఽతిశేతే పరం
శ్రీవాగుక్తిసమాఖ్యకో కృతిమణిః తత్త్వార్థసందర్శకః.

లోకంలో ఎవరైనా తన గొప్పతనాన్ని తానే స్వయంగా చెప్పుకుంటే, ఆ మాటకు ప్రాధాన్యం ఉండదు. ఆ గొప్పతనమే ఇతరులు పలికితే అది ప్రమాణం అవుతుంది. గీత, తిరువాయ్ మొழி రెండు భగవంతుని వైభవాన్ని తెలిపేవే. అయినప్పటికీ, కృష్ణుడు పలికిన భగవద్గీత కంటే నమ్మాళ్వార్ పలికిన, తత్త్వాలను మనకు తెలిపే తిరువాయ్ మొழி ప్రబంధం ఎక్కువ గొప్పతనాన్ని కలిగినది.

59) పుండ్రేక్షూద్భవనూత్నసారకలశః? హైయంగవీనం భవేత్?
ఏలామిశ్రిత కామధేను పయసో భాండోఽథ వా స్యాదయమ్?
క్షీరాబ్ధేః మథనోద్ధృతామృతరసః? పుష్పాసవో నూతనః?
కిం వక్ష్యామి పరాంకుశోదితమిదం గీతీసహస్రం ప్రతి.

(పుండ్రేక్షు) నామాల చెరకునుండి తీసిన రసంతో నిండిన కలశమని చెప్పాలా? లేక, యాలకులు మొదలైన సుగంధ ద్రవ్యాలతో కూర్చిన, కామధేనువు పాలతో నిండిన భాండమని చెప్పాలా? పాలసముద్రం చిలికినప్పుడు బయటపడిన అమృతరసం అని చెప్పాలా? లేక, అప్పుడే కాచిన గుమగుమలాడే నెయ్యి అని చెప్పాలా? నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధాన్నిగూర్చి ఏమని చెప్పాలి?

60) నైవేచ్ఛామి కదాపి లబ్ధు మవనీచక్రాధిరాజ్యశ్రియం
నాస్తీచ్ఛా మమ షడ్రసాత్మకపదార్థాస్వాదనే జాయతే,
కింత్వస్త్యేవ పరాంకుశార్యవదనాంభోజాతజాతామల–
శ్రీవాగుక్తిమరందభోగవిషయే వాంఛాఽతితీవ్రా మమ.

ఈ సమస్త భూమండలాన్ని పాలించడం అనే సంపదను పొందడంలో నాకు ఆశ లేదు. ఆరు రుచులతో కూడిన రుచికరమైన భోగ్య పదార్థాలను ఆస్వాదించడంలో కోరిక కూడా లేదు. కానీ, నమ్మాళ్వారుల ముఖకమలం నుండి ఉద్భవించిన తిరువాయ్ మొழி ప్రబంధం అనే మకరందాన్ని ఆస్వాదించడంలో మాత్రం కోరిక ఉన్నది.

61) ఆద్యా గీతా మహార్థా ప్రవిలసతి చతుఃసూత్రికార్థప్రదాత్రీ
పాదాదాద్యాత్ సమింధేఽనవధికగుణవిభూత్యాదిమత్తా మురారేః,
తస్మాత్ శారీరకాద్యాధికరణమిహ సంసూచితం భాతి పాదాత్
ఏతస్మాదిత్యనర్ఘా వివృతిరియమహో వక్ష్యపూర్వార్థసారమ్.

తిరువాయ్ మొழி ప్రబంధంలో మొదటి పాశురంలోని నాలుగు పాదాలు శారీరక మీమాంసాశాస్త్రంలోని చతుఃస్సూత్రి అనే మొదటి నాలుగు సూత్రాల సారాన్ని తెలుపుతున్నాయి. అందులో మొదటి పాదం, భగవంతుడు నిరవధికమైన గుణ విభూతులను కలిగి ఉన్నాడు అనే విషయాన్ని తెలియజేస్తున్నది. దీనివల్ల, ఇటువంటి భగవంతునకు సంబంధించిన జ్ఞానాన్ని మనం.పొందాలనే కోరిక మనకు కలుగుతుంది. అందుచేత ఈ మొదటి పాదం మొదటి అధికరణమైన జిజ్ఞాసాధికరణంలోని సారాన్ని తెలుపుతున్నది అనే ఈ గొప్ప విలువైన వివరణం మనకు అపూర్వమైన విషయాన్ని తెలియజేస్తున్నది.

62) ద్వైతీయీకం తు జన్మాద్యధికరణవరార్థం వ్యనక్తీహ పాదం
స ధ్యేయో యోఽనుగృహ్ణాత్యత ఇహ భగవద్ధ్యేయతా సూచితాఽసీత్,
ధ్యేయత్వాత్ కారణత్వం తత ఉదిత మభూల్లక్షణం బ్రహ్మణోఽస్మిన్
పాదే, సర్వం తదేతత్ నిగమయుగహృదోః భావసామ్యానురూపమ్.

ఆ విధంగానే, మొదటి పాశురంలోని రెండవ పాదంలో చతుస్సూత్రిలోని రెండవ అధికరణమైన జన్మాద్యధికరణం సూచింపబడినది. ఏ విధంగా అంటే, ఈ పాదంలో

ఎటువంటి దోషాలు లేని, భక్తిరూపంలోని జ్ఞానాన్ని భగవంతుడు అనుగ్రహించాడు. అని చెప్పబడింది. ఎవడు అనుగ్రహిస్తాడో, ఎవడు. కృప కలిగినవాడో అతడే ధ్యానం చేయదగినవాడు కనుక, ధ్యానం అనేది జగత్కారణ విషయంలోనే కుదురుతుంది కనక, రెండవ పాదంలో భగవంతుని జగత్కారణత్వం చెప్పబడింది. ఈ విధంగా ఇక్కడ, సృష్టి స్థితి లయాలను చేసే, జగత్కారణమైన భగవంతుని లక్షణం చెప్పబడినందున ఇది జన్మాద్యధికరణసారం అని చెప్పవలసి ఉన్నది. ఇది అంతా ఉభయ వేదాంతాల హృదయాలలోని ఐకమత్యానికి గుర్తు.

63) శ్రీవాగుక్తికృతౌ ద్వయాభిధమనో రర్థః కుతో వ్యుత్క్రమే
భాతీతి ప్రభవేత్ హృది ప్రబలసందేహః, సమాధి స్త్వియమ్,
ప్రాధాన్యం చ పరోపదేశసమయేఽర్థస్యేతి హేతోరభూత్
ఆదా వుత్తరవాక్యభావవివృతిః.తస్మాన్న కాఽపి క్షతిః.

తిరువాయ్ మొழி ప్రబంధంలో ద్వయమంత్రంలోని రెండు వాక్యాల అర్థం సక్రమంలో కాకుండా, వ్యుత్క్రమంలో అనుసంధింపబడినది అని నంబిళ్ళై అనే మహాచార్యులు తన ఈడు వ్యాఖ్యానంలో వచించారు. అయితే ఇక్కడ, ఈ విధంగా ద్వయమంత్రంలోని అర్థం వ్యుత్క్రక్రమంలో ఎందుకు చెప్పబడింది? అనే ప్రశ్న కలుగుతుంది. దీనికి సమాధానం ఏమంటే, ఈ ప్రబంధం పరోప దేశాన్ని ప్రధానంగా కలిగినది. ఉపదేశసమయంలో ప్రయోజనం ముందు చెప్పి, కర్తవ్యాన్ని తరువాత విధించడం క్రమం. ఆ క్రమాన్ని బట్టి ఇక్కడ కూడా ముందు భగవంతుని కైంకర్యరూపమైన ప్రయోజనాన్ని తెలిపే ఉత్తర వాక్యంలోని అర్థాన్ని తెలియజేసి, ఆ తరువాత, దానిని పొందడానికి సాధనమైన శరణాగతి చెప్పబడింది, అందుచేత ఈ విధంగా వ్యుత్క్రమంలో చెప్పడంలో ఏ లోటూ లేదు అని గ్రహించాలి.

64) సర్వజ్ఞోఽపి నిశమ్య యా మకురుతానందాత్ శిరఃకంపనం
సర్వే ధూర్తజనాః యదర్థవశతో ధావంతి దూరం భయాత్,
సర్వేషాం సుధియాం చ యా రసవిదాం పీయూషభాండాయతే
తస్యై శ్రీశఠజిత్సహస్రకృతయే కుర్యాం నమాంస్యన్వహమ్.

సర్వజ్ఞుడైన భగవంతుడు కూడా తిరువాయ్ మొழி ప్రబంధాన్ని విని గొప్ప ఆనందంలో తన తలను ఊగించడో, ఏ తిరువాయ్ మొழி ప్రబంధంలోని అర్థాలను చూచి ధూర్తులు దూరంగా పారిపోతారో, ఏ తిరువాయ్ ప్రబంధం రసజ్ఞులైన పండితులకు అమృతభాండం వంటిదో ఆ ప్రబంధానికి ప్రతిదినం మనం నమస్కారం చేద్దాం

65) శ్రీవాగుక్తిప్రబంధామృత రససతతాస్వాదనేనాత్తశక్తిః
ధృత్వా వేదాఖ్యదండం యతినృపతికరీ సోఽయ మభ్యేతి వేగాత్,
హే హే శుష్కేషు వాదేష్వనిశ మభిరతాః! వాదినః! పశ్యతైనం
యుష్మద్గర్వం సమస్తం త్యజత విసృజత, ప్రాణరక్షాం కురుధ్వమ్..

తిరువాయ్ మొழி ప్రబంధం అనే అమృతాన్ని సదా ఆస్వాదించడం వల్ల గొప్ప బలాన్ని పొందిన భగవద్రామానుజభద్రగజం వేదమనే దండాన్ని గ్రహించి వేగంగా వస్తున్నది. గమనించండి. శుష్కవాదాలను చేసే ఓ ప్రతి వాదులారా! మీరు మీ గర్వాన్ని పూర్తిగా విడవండి, పూర్తిగా విడవండి.మీ ప్రాణ రక్షణ చేసుకోండి.

66) యస్యాం భాతి సరోమునీంద్రముఖవాక్తత్త్వం విశిష్టార్థదం,
యాం వ్యాఖ్యాంతి కలిఘ్నసూరికృతయో వేదాంగరూపాశ్చ షట్ ,
యత్సాహాయ్యవశాత్ యతీట్ వివృణుతే సూత్రాణి శారీరకే
శ్రీవాగుక్తిమహో! కథం హి వచనై రల్పైః స్తువేయం మమ?

ఏ తిరువాయ్ మొழி ప్రబంధంలో సరోయోగి మొదలైన ముదలాళ్వార్ల సూక్తుల భావాలు ప్రకాశిస్తున్నాయో, ఏ తిరువాయ్ మొழி ప్రబంధంలోని సూక్తులను తిరుమంగై ఆళ్వార్ ఆరు ప్రబంధాలు వివరిస్తున్నాయో, ఏ తిరువాయ్ మొழி ప్రబంధంలోని సూక్తులను ఆధారంగా చేసుకొని భగవద్రామానుజులు బ్రహ్మసూత్రాలను వ్యాఖ్యానించారో, అటువంటి వైభవాన్ని కల తిరువాయ్ మొழி ప్రబంధాన్ని నా అల్పమైన వాక్కులతో ఏ విధంగా కీర్తించగలను?

67) పీయూషోపమశుద్ధవాక్తతిజలైః పూర్ణే మనోహారిభిః
శ్రీనారాయణముఖ్యనామజలజశ్రేణీసుగంధాంచితే,
శ్రీరంగాదిమురారిదివ్యవసతిప్రస్తావనాత్ శీతలే
శ్రీవాగుక్తిసరోవరేఽహ మనిశం గాహే ఽ సకృత్ సోత్కటః.

అమృతంవంటి, నిర్మలమైన, మనసును దోచే వాక్కుల సమూహమనే జలంతో నిండినది, నారాయణ అని మొదలైన భగవన్నామాలు అనే పూల సుగంధంతో ప్రకాశిస్తున్నది, శ్రీరంగం మొదలైన భగవంతుని దివ్య దేశాల ప్రస్తావన వల్ల చాలా చల్లనిది అయిన తిరువాయ్ మొழி ప్రబంధం అనే గొప్ప సరస్సులో నేను నిత్యం లోతుగా అవగాహిస్తాను.

68) నానావృత్తనిబద్ధగీతికుసుమవ్యాప్త్యా ఽ తిభవ్యాకృతౌ
నానాక్షేత్రవిశేషమండపవరైః విశ్రాంతిదే సర్వదా,
సర్వత్రాద్భుతభావబంధురశతిప్రాంచత్తటాకైః వృతే
శ్రీవాగుక్త్యభిధాననందనవనే విందామి మోదం చరన్.

అనేక విధాలైన వృత్తాలలో రచింపబడిన పాశురాలు అనే అందమైన పూలతో నిండి ఉండడంచేత చాలా మనోహరంగా ఉండే ఆకారాన్ని కలిగినది, శ్రీరంగం మొదలైన పలు క్షేత్రాల రూపంలోని గొప్ప మండపాలతో విశ్రాంతిని కలిగించేది, అంతటా

అద్భుతమైన భావాలతో అందంగా ఉండే శతకాలు అనే ప్రకాశించే తటాకాలతో నిండినది అయిన తిరువాయ్ మొழி దివ్య ప్రబంధం అనే నందనవనంలో నేను ఎల్లప్పుడూ సంచరిస్తూ ఆనందిస్తాను.

69) గీత్యాకారకపత్రరాశిసుభగం శ్రీరంగనాభియుతం
భక్త్యాకృత్యపరూపసౌరభమనోజ్ఞస్వభావం తథా,
చిత్రాలంకృతిసాధితాతులలసద్వర్ణాభిరామం సదా
శ్రీవాగుక్తిసహస్రపత్రకమలం శీర్షే వహామ్యద్భుతమ్.

పాశురాల రూపంలోని పూరేకులను కలిగినందున అందమైనది, శ్రీరంగ క్షేత్రాన్ని మధ్యలో బొడ్డుగా కలిగినది, భక్తిభావం వల్ల కలిగిన, అపరూపమైన సుగంధం కలిగి ఉండడం చేత మనసును హరించేది స్వభావం కలిగినది ,ఆశ్చర్యాన్ని కలిగించే,.సాటి లేని, ప్రకాశించే గొప్ప వర్ణాన్ని కలిగినదై ఉన్నందున అందమైనది అయిన తిరువాయ్ మొழி దివ్యప్రబంధం అనే అద్భుతమైన వేయి రేకుల పద్మాన్ని నేను నా శిరస్సుపై ఎల్లప్పుడూ ధరిస్తాను.

70) వాసో మే భవతాత్ వనేఽథ భవనే స్వర్గేఽథవా భూతలే
విష్ణోర్వా వసతౌ తథైవ భవతాత్ కైవల్యలోకేఽథవా,
స్యాన్మే పుణ్యఫలానుభూతి రథవా పాపస్య వా సర్వథా
శ్రీవాగుక్తిమహం వదామి చ సదా కుర్వే తదర్థస్మృతిమ్.

నాకు నివాసం వనంలో కాని, భవనంలో కాని, స్వర్గంలో కానీ, భూమిలో కాని పరమపదంలో కానీ, కైవల్య లోకంలో కాని ఏర్పడనీ. నాకు పుణ్యఫలానుభవం కలుగనీ,లేక, పాపఫలమే కలుగనీ. ఎల్లప్పుడూ నేను తిరువాయ్ మొழி ప్రబంధాన్ని అనుసంధానం చేస్తాను. దాని అర్థం స్మరిస్తాను.

71) ఉత్ప్రేక్షా రూపకం వా స్మృతిరపి చ సమోదాత్తనామాంకితౌ వా
శ్లేషో వాథోపమా వాప్యథ చ బహువిధాలంకృతీనాం ప్రకారాః
సర్వా శ్చేతాః శఠారేః చరమకృతివరం ప్రాప్య సార్థా భవంత్యో
భూష్యత్వం చాశ్నువంత్యః ప్రదదతి చ ముదం ధీమతా మంతరంగే.

ఉత్ప్రేక్షా, రూపకం, స్మృతి, ఉదాత్తం, శ్లేష, ఉపమా, ఇంకా పలు విధాలైన అలంకారాలు అన్నీ నమ్మాళ్వార్ల తిరువాయ్ మొழி ప్రబంధాన్ని ఆశ్రయించి సార్థక్యాన్ని పొంది, ఆ ప్రబంధంవల్ల భూష్యభావాన్ని పొందినవై, పండితుల హృదయాలలో ఆనందాన్ని కలిగిస్తున్నాయి.

72) వైదర్భీరీతిరస్యాం శఠమథనకృతౌ గీతికాసు ప్రభాతి
ద్రాక్షాపాకః సమంతాద్విలసతి చ రసజ్ఞస్య చిత్తాపహారీ,
మాధుర్యాఖ్యో గుణోఽత్ర సహృదయహృదావర్జకస్సన్ సమింధే
సత్కావ్యప్రోక్తధర్మాః అపి సకలవిధా లక్ష్యమాణా లసంతి.

నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధంలో వైదర్భీరీతి అంతటా ప్రకాశిస్తున్నది. ద్రాక్షాపాకం కూడా అంతటా ప్రకాశిస్తూ రసజ్ఞుల హృదయాలను దోచుకుంటున్నది. మాధుర్యం అనే గుణం ఈ ప్రబంధంలో ప్రకాశిస్తూ సహృదయ హృదయాలను ఆకర్షిస్తున్నది. మంచి కావ్యానికి నిర్వచించబడిన లక్షణాలు అన్ని ఇందులో చక్కగా కనిపిస్తున్నవి.

73) కావ్యేఽస్మిన్ నాయకః స్యాత్ శుభగుణనిలయః శ్రీపతిః సుందరాంగో
నాథప్రేమాభిపూర్ణా వకుళసుమధరా నాయకీ చానవద్యా,
లక్ష్యాణ్యష్టాదశాఽత్రాఽప్యతివిశదతయావర్ణనాని ప్రబంధే
"సర్వం పూర్ణం స హోమి"త్యుపనిషదుదితా సార్థకీ సూక్తిరత్ర.

నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధంఅనే మహాకావ్యంలో నాయకుడు అన్ని గుణాలను కలిగిన, సుందరుడైన శ్రీమన్నారాయణుడు. నాయకి ఎవరంటే, నాయకుడైన భగవంతుని విషయంలో ప్రేమను పూర్ణంగా కలిగిన, ఏ దోషం లేని నమ్మాళ్వారులు అనే నాయిక. ఆ విధంగానే మహాకావ్యంలో వర్ణించబడాలని చెప్పబడిన అష్టాదశ వర్ణనలు ఇక్కడ కూడా మనకు గోచరిస్తాయి. అందుచేత ఉపనిషత్తులో చెప్పబడే "సర్వం పూర్ణం స హోమ్"— సకలం సంపూర్ణం—అనే వాక్యం ఇక్కడ సార్ధకం అవుతున్నది.

74 【స్యాచ్చేత్ (యద్యేషః) 】శ్రీమాన్ చేత్ శఠజిత్ భవత్యనుభవే పూర్ణః తదాఽస్మిన్ కథం
విశ్లేషేణ పరస్య దుఃఖమితి నో జాయేత శంకా నను,
అత్రోక్తా తు వియోగజార్తి రితరేష్వాశా గుణేష్వీశితుః
తద్భోగాయ హృది స్థితా బలవతీ వాంఛా హి తం బాధతే.

భగవదనుగ్రహం వల్ల భగవంతుని అనుభవించి, పరిపూర్ణులు అయిన ఆళ్వార్లకు భగవంతుని విశ్లేషించడం, దానివల్ల ఆర్తిని పొందడం, ఆర్తితో పలుమార్లు బాధతో పలకడం అనే వీనిని అన్నిటిని ఏ విధంగా అర్థం చేసుకోవాలి? అనే సందేహం ఇక్కడ మనకు కలుగవచ్చు. ఇక్కడ చెప్పబడిన భగవద్వియోగం ఏమంటే, అనుభవించిన గుణాల అనుభవం వల్ల ఇంకా అనుభవించవలసిన గుణాలలో కలిగిన ఆశయే. ఆ గుణాలను అనుభవించాలి అని ఆళ్వారుల హృదయంలో ఉండే బలమైన కోరికయే ఆవిధంగా వారిని బాధిస్తుంది అని గ్రహించాలి.

75) భాషాగానం న కుర్యాదితి నియమదృశా వీక్ష్యతే చేత్, శఠారేః
కావ్యే గాథాసహస్రే కథమిహ భవతాత్ గ్రాహ్యతేత్యత్ర శంకా,
అత్ర ప్రోక్తో నయోఽయం తు భగవదితరేష్వన్వయం యాతి నాత్రే—

త్త్యుక్తా విద్భిః సమాధిః, తత ఇహ న భవేదప్రమాణత్వబుద్ధిః.

"భాషాగానం న గాతవ్యమ్"— ప్రాంతీయ భాషలో కావ్యగానం చేయరాదు— అనే నియమాన్నిబట్టి చూచినప్పుడు, నమ్మాళ్వార్ తిరువాయ్ మొழி ప్రబంధం ప్రాంతీయమైన ద్రావిడ భాషలో గానం చేయబడింది కదా, అది ఏవిధంగా గ్రహించదగినది?, అనే సందేహం కలుగుతుంది. దీనికి పెద్దలు ఏమని సమాధానం చెప్పారు?అంటే, ఈ నియమం భగవంతుని విషయంలో వర్తించదు, మిగిలిన విషయాలలోనే ఈ నియమం వర్తిస్తుంది, అందుచేత ఇక్కడ సందేహానికి అవకాశం లేదు— అని సమాధానం చెప్పారు. ఈ కారణం వల్ల తిరువాయ్ మొழி ప్రబంధం అప్రమాణం అనే సందేహానికి అవకాశం లేదు.

76) తత్త్వార్థాన్ సకలాన్ దదాతి, హృదయే శుద్ధిం ప్రదత్తేఽధికాం,
భక్తిం కేశవపాదపద్మయుగళీలక్ష్యాం చ శుద్ధాం పరామ్.
లక్ష్మీం చైహికపారలౌకికమయీం నిత్యాభివృద్ధాం దిశేత్
తస్మాత్ కల్పలతోపమా కృతిరియం స్యాద్గీతిసాహస్రికా

అన్ని విధాలైన తత్వార్థాలను ఇస్తుంది. మనసులో అధికమైన శుద్ధిని కలిగిస్తుంది. భగవంతుని పాదపద్మాల విషయంగా గొప్ప భక్తిని కలిగిస్తుంది. ఈ లోకంలో, పరలోకంలో నిత్యం వృద్ధి చెందే సంపదలను కలిగిస్తుంది.అందుచేత నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధం అన్నిటినీ ఇచ్చే కల్పలత వంటిది.

77) గీతిసాహస్రమేవ ప్రసృమరవిలసత్ రశ్మిజాలోపమానం
తస్యార్థ శ్చాతపః స్యాత్ శ్రుతివిమతవచోవాదినాం భీతిదాయీ,
చక్రాబ్జాద్యాయుధైః శ్రీపతిరపి దదతే దర్శనం స్వస్య సాక్షాత్
శ్రీవాగుక్తిప్రబంధం ద్యుమణిసమరుచిం భావయామః త్రిసంధ్యమ్.

తిరువాయ్ మొழி ప్రబంధంలోని వేయి పాశురాలే అంతటా వ్యాపించే స్వభావం కలిగిన, ప్రకాశించే కిరణాల సమూహం వంటివి. ఆ పాశురాలను నుండి స్ఫురించే అర్థాలే వేదానికి విరుద్ధంగా వాదించేవారి మనసులకు తాపాన్ని కలిగించే ఎండవంటిది. సూర్య మండలంలో శంఖచక్రాలను ధరించిన శ్రీమన్నారాయణుడు గోచరించినట్లే, తిరువాయ్ మొழి ప్రబంధంలో కూడా సర్వత్రా సకల ఆయుధాలతో కూడిన భగవంతుడు సాక్షాత్కరిస్తాడు. అందుచేత ఈ ప్రబంధం సూర్యుని వంటిది. ఇటువంటి ఈ ప్రబంధాన్ని మూడు వేళల భావన చేద్దాం.

78) భక్త్యా సంసేవితానాం హృది భవతి సుధాంశూపమో భవ్యరూపో
వైరుధ్యేనాశ్రితానాం మనసి చ తపనాభో భవేదుగ్రకాంతిః,
శౌచేనార్థేషు భాయాత్ హుతవహసదృశః శ్రోత్రియైః నిత్యసేవ్య
శ్రీవాగుక్తిప్రబంధః స్ఫురతి హి బహుధా చక్రరాజేన తుల్యః.

భక్తితో తనను సేవించినవారికి చంద్రునివలె భవ్యమైన రూపంతో తిరువాయ్ మొழி ప్రబంధం సాక్షాత్కరిస్తుంది. విరుద్ధమైన భావనతో దరి చేరినవారికి తాపం కలుగజేసే సూర్యునివలె ఉగ్రమైన కాంతితో ప్రకాశిస్తుంది. అతిపవిత్రమైన అర్థాలతో కూడినది కావడం చేత నిత్యం శ్రోత్రియలచేత ఆరాధింపబడే పవిత్రమైన అగ్నివలె ప్రకాశిస్తున్న ది. ఈ విధంగా సూర్య చంద్రాగ్ని సాదృశ్యం కలిగి ఉండడం ఈ ప్రబంధం సుదర్శన చక్రంతో సమానంగా భాసిస్తున్నది.

79) విజ్ఞానాం హృదయాంబుజప్రమద మాధాతుం పరం భూతలే
వేదాధ్వవ్యతిరిక్తవాదతమసో రాశేః వినాశాయ చ,
చైతన్యం విదధాతు మజ్ఞమనసాం, నీరోగతాం చ స్థిరామ్,
శ్రీవాగుక్తిదివాకర స్సమజని శ్రేయఃప్రదానక్షమః.

ఈ లోకంలో విద్వాంసుల మనసులు అనే పద్మా లకు గొప్ప ఆనందం కలిగించడంకోసం, వేదమార్గానికి విరుద్ధమైన వాదనలు అనే చీకటిరాశి నశించడం కోసం, అజ్ఞానులం అయిన మనవంటివారి హృదయాలలో చైతన్యం కలగడం కోసం, అందరికీ ఆరోగ్యం స్థిరంగా కలగడం కోసం, శ్రేయస్సును కలిగించే తిరువాయ్ మొழி ప్రబంధం అనే సూర్యుడు అవతరించాడు.

80) పాపానాం హరణాత్, సమున్నతసదాకారేణ సందర్శనాత్
పద్మానాథసమాశ్రయాత్ సుభగవాగుద్యానపంక్త్యాఽపి చ,
శృంగారాద్భుతనైకనిర్ఝరరసైః సంప్రేక్ష్యభావాదిదం
శ్రీమద్వేంకటశైలరాజసదృశం గీతీసహస్రం మునేః.

శ్రీ వేం.కటాచలం పాపాలను హరిస్తుంది ఆ విధంగానే తిరువాయ్ మొழி ప్రబంధం కూడా పాపాలను హరిస్తుంది.వేకటాచలం ఉన్నతమైన గొప్ప ఆకారాన్ని కలిగి ఉంటుంది. ఈ ప్రబంధం కూడా ఉన్నతమైన గొప్ప ఆకారాన్ని కలిగి ఉన్నది. వేంకటాచలంలో నిత్యం పద్మానాథుడు అయిన శ్రీనివాసుడు నివసిస్తాడు. ఈ ప్రబంధంలో కూడా అర్థం ద్వారా నిత్యం ఆ స్వామి వేంచేసి ఉంటాడు. వేంకటాచలంలో అంతటా ఎన్నో అందమైన ఉద్యానవనాలు ఉన్నాయి. ఆ విధంగానే ఈ ప్రబంధంలో కూడా అందమైన వాక్కులు అనే ఉద్యానవనాలు ఉన్నాయి. వేంకటాచలంలో అంతటా అందమైన, ఆశ్చర్యకరమైన కొండవాగులా ప్రవహిస్తాయి. ఈ ప్రబంధంలో కూడా దివ్యశృంగారం అద్భుతం మొదలైన రసప్రవాహాలు ప్రవహిస్తున్నాయి. అందుచేత ఈ ప్రబంధం శ్రీవేంకటాద్రితో సమానం అని భావించబడుతున్నది.

81) యః ప్రీత్యా సేవతేఽస్మై ప్రదిశతి భగవానాత్మబుద్ధిప్రకాశం
తద్వత్ వేదోఽపి నైజామలహృదయగతిం వక్తి భక్తాయ సర్వామ్,
శ్రీవాగుక్తి స్తథైవాశ్రితజనమనసి ద్యోతతే.స్పష్టరీత్యా
తత్ సేవధ్వం సదైనాం దృఢతరనిహితేనాంతరంగేణ యూయమ్.

తనను ప్రీతితో కొలిచేవానికి భగవంతుడు తనకు సంబంధించిన జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. ఆ విధంగానే, వేదం కూడా తన నిర్మలమైన హృదయ గతిని తనను ఉపసించినవానికి వ్యక్తం చేస్తుంది. ఆ విధంగానే,తిరువాయ్ మొழி ప్రబంధం కూడా తనను ఆశ్రయించినవానికి స్పష్టంగా గోచరిస్తుంది. అందుచేత మీరు ఆ ప్రబంధాన్ని దృఢంగా నిలిపిన బుద్ధిలో సేవించండి.

82) స్త్రీశూద్రాదివిభాగశూన్యసమతాభావేన సర్వేష్వపి
వ్యక్తీకృత్య దయాం నిజాం నిరుపధిం శ్రీమాన్ శఠారిః కవిః,
ప్రోవాచాగమశాస్త్రసారమఖిలం సద్ద్రావిడీయాతుల–
స్వచ్ఛస్వాదుగిరాఽమృతోపమకృతిం గాథాసహస్రాత్మకామ్.

స్త్రీలు, శూద్రులు మొదలైన ఏ విధమైన భేదాలు పరిగణించకుండా, అందరి విషయంలోనూ సమభావంతో, అందరి పట్ల తమ సహజమైన దయను వ్యక్తం చేస్తూ నమ్మాళ్వారులు అందమైన ద్రావిడ బాషలో, సాటిలేని స్వచ్ఛమైన, చాలా రుచికరమైన ద్రావిడ వాక్కులతో వేయి పాశురాలను కల తిరువాయ్ మొழி ప్రబంధం ద్వారా వేదార్థ సారాన్ని అంతటినీ వ్యక్తం చేశారు.

83) గంగాజన్మాదివృత్తైః భగవదనుభవో రుధ్యతే హ్యాదికావ్యే
గాంగేయాదిప్రసక్త్యాఽప్యభవదిహ మహాభారతం దోషజుష్టమ్,
తత్తాదృగ్దోషముక్తో హరిగుణకథనే నిత్యసక్తోఽతిశుద్ధః
శ్రీవాగుక్తిప్రబంధోఽమృతరసమధురో నిత్యభావ్యోఽనుభావ్యః.

శ్రీ రామాయణంలో గంగావతరణవృత్తాంతం మొదలైన అనావశ్యకమైన వృత్తాంతాలను ప్రస్తావించడంచేత భగవంతుని అనుభవం అడ్డగింపబడింది.భీష్ముని కథ మొదలైన అక్కరలేని విషయాల సంబంధం చేత మహాభారతం కూడా దోషాన్ని కలిగినది అయినది. ఇటువంటి ఏ దోషాలు లేనిది, కేవలం భగవంతుని గుణాలను

చెప్పడంలోనే ఆసక్తిని కలిగినది, అందుచేత చాలా పరిశుద్ధమైనది అయిన తిరువాయ్ మొழி ప్రబంధం అమృతరసం కంటే మించి మధురమైనది, నిత్యం అనుసంధించదగినది,అనుభవించదగినది.

84) ప్రాక్పద్యాంతస్థభాగో యది ఘటిత ఇహాఽనంతరస్యాదిభాగే
సాంఽతాదిర్నామ కాచిత్ సుమధురకవితాప్రక్రియా ద్రావిడీయా,
తస్యామేవేద ముక్తం.శఠమథనకవేః దివ్యగీతాసహస్రమ్
సోంఽతాద్యాకారరూపో విలసతి భగవాన్ తత్ స్తుతః శేషశాయీ

ముందు ఉండే పద్యంలోని చివరి భాగం రెండవ పద్యంలోని ఆరంభంలో కూర్చబడితే ఆ ప్రక్రియకు అంతాది అని పేరు. ఇది ఒక మధురమైన, ద్రావిడ ప్రబంధాలలోని క్రమం. ఆ అంతాది క్రమంలోనే తిరువాయ్ మొழி ప్రబంధం కూర్చబడింది. ఆ ప్రబంధంచేత చెప్పబడే భగవంతుడు కూడా అంతాదిరూపుడే.

85) వాల్మీకేః జ్ఞానమూలం కమలభవకృతానుగ్రహః ,సోఽయమాస్తే
సృష్ట్యాం శ్రీశస్య కశ్చిత్, పరిమితధిషణోఽప్యల్పశక్తిర్హి బ్రహ్మా,
జ్ఞానస్య శ్రీశఠారేః భవతి మురహరః సర్వవిత్ మూల,మస్మాత్
శ్రీవాగుక్తిప్రబంధో రఘువరచరితాత్ స్యాద్బలీయః ప్రమాణమ్.

శ్రీ రామాయణాన్ని రచించిన వాల్మీకి మహర్షి జ్ఞానానికి మూలం చతుర్ముఖబ్రహ్మ. ఈ బ్రహ్మ భగవంతుని సృష్టిలో ఒకడు. పరిమితమైన బుద్ధిని ,శక్తిని కలవాడు.నమ్మాళ్వారుల జ్ఞానానికి మూలం సర్వజ్ఞుడైన శ్రీమన్నారాయణుడు. అందువల్ల నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొழி ప్రబంధం శ్రీ రామాయణం కంటే మిక్కిలి ప్రభావాన్ని కలిగినది.

86) సోఽయం శ్రీమచ్ఛఠారిః భగవదనుపమస్ఫీతశీతావలోకాత్
సాక్షాద్దృష్టాఖిలశ్రీపతిగుణవిభవో జ్ఞానినా మగ్రగణ్యః,
బాల్యాత్ స్నిగ్ధో మురారౌ చ తదమలనిషంగైకధార్యాత్మకత్వాత్
సామ్యం సౌమిత్రిణా శ్రీజనకతనయయా తస్య భవ్యం విభాతి.

ఈ నమ్మాళ్వారులు భగవంతుని సాటి లేని, బలమైన, చల్లని కటాక్షాల ప్రభావంవల్ల సాక్షాత్తుగా భగవంతుని స్వరూపరూప గుణవిభూతిలీలాదులను దర్శించినవారు కావడంచేత జ్ఞానులలో చాలా గొప్పవారు. చాలా చిన్నతనంనుండి భగవంతుని విషయంలో ప్రేమను కలిగి ఉండేవారు, ఆ భగవంతుని సంబంధం లేకపోతే నిలువలేని స్వభావం కలిగినవారు అయిన వీరు, లక్ష్మణునితో, సీతాదేవితో అందమైన సామ్యాన్ని పొంది ప్రకాశిస్తున్నారు.

87) తత్తచ్చేతనవాంఛితానుగుణతో దాత్రీ ఫలానాం, తథా
శాస్త్రోక్తాఖిలలక్షణైః పరిగతా, శ్చాన్యాపదేశోక్తికా,
అన్యై శ్చాపి చ వైదికేతరజనైః సంగృహ్యమాణేత్యతః
శ్రీవాగుక్తికృతిః పరాంకుశకవేః భాతి ప్రమాణం పరమ్.

ఆయా చేతనుల కోరికలకు తగినట్లుగా వారిని అనుగ్రహించడం వల్ల, ద్రావిడ అలంకార శాస్త్రంలో చెప్పబడిన అన్ని విధాలైన లక్షణాలను కలిగి ఉండడంవల్ల, నేరుగా కాకుండా అన్యాపదేశ క్రమంలో తత్వాలను ఉపదేశించటం వల్ల, వైదికులులే కాకుండా ఇతరులుకూడా దీనిని పరిగ్రహించడం వల్ల నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధం గొప్ప ప్రమాణం అవుతున్నది.

88) కైవల్యైశ్వర్యయోః యన్నిరసనమపి తదీయాల్పతాస్థైర్యహేతోః
అత్రోక్తః కామరూపోఽపి భవతి పురుషార్థః పరస్మిన్ హి భక్తిః,
భక్తేరుత్పాదకోఽసౌ, వపి ఝటితి పరస్య వ్యనక్తి ప్రభావం
సర్వేశస్య, ప్రబంధః శఠమథనకృతః స్యాత్ ప్రమాణం చతుర్థః.

తిరువాయ్ మొழி ప్రబంధంలో ఐశ్వర్య పురుషార్థం, కైవల్య పురుషార్థం నిరాకరించబడ్డాయి కదా! అది ఏ ఉద్దేశ్యంలో? ఈ లోకంలో అందరూ ఆదరించే వీటిని నిరాకరించడానికి కారణం , అవి అల్పమైనవి,  అస్థిరమైన కనుక. మరి శృంగార రసక్రమంలో పాశురాలను పాడడం వల్ల ఈ ప్రబంధం ఏవిధంగా ప్రమాణం అవుతుంది? అంటే, ఇక్కడ చెప్పబడిన కామం వేదాంతశాస్త్రం విధించిన భగవంతుని విషయంలో భక్తియే. అందువల్ల దోషం లేదు. అంతేకాక, ఈ ప్రబంధాన్ని పఠించినవారికి భక్తి కలుగుతుంది. భగవంతుని వైభవాన్ని ఈ ప్రబంధం చాలా వేగంగా వ్యక్తం చేస్తుంది. ఈ కారణాల వల్ల తిరువాయ్ మొழி ప్రబంధం తప్పక ప్రమాణం అవుతున్నది.

89) లోకానుగ్రహకాంక్షయైవ భగవాన్ శ్రీమచ్ఛఠారేః కవేః
నిస్సీమాం హృదయేఽద్భుతాం చ జనయన్నార్తిం, ప్రబంధాన్ బహూన్,
రస్యాన్ కారయతి స్మ యైః జగదిదం తర్తుం జనేః వారిధిం
శక్నోతీతి వదంతి దేశికవరా యుక్తం వచః సుందరమ్.

లోకాలను అనుగ్రహించాలి అనే భావంతోనే భగవంతుడు ఆళ్వారుల మనసులో గొప్ప ఆర్తిని కలిగించి, అనేక విధాలైన, గొప్ప రసవంతమైన ప్రబంధాలను పాడించాడు. ఈ ప్రబంధాల కారణంగానే ఈ లోకం జన్మసముద్రాన్ని దాట గలుగుతున్నది– అని మన పూర్వాచార్యులు పలికిన అందమైన, తగిన మాట.

90) తత్త్వార్థప్రది రత్ర కామపురుషార్థప్రస్తుతిప్రక్రియా–
రీత్యా శ్రీశఠవైరిణా కిమితి నిర్వ్యూఢేతి శంకా భవేత్,
అత్రార్యైః గుడజిహ్వికాఖ్యసరణిః యెదాహృతా సాఽన్వయం
సమ్యక్ ప్రేత్య సమీరయేద్ధి హృదయం వక్తుః శఠారేః స్ఫుటమ్.

తిరువాయ్ మొழி ప్రబంధంలో నమ్మాళ్వారులు వేదాంత తత్వాలను ఆవిష్కరించడానికి కామ పురుషార్థప్రస్తావనను ఎందుకు చేశారు? అనే సందేహం మనకు కలుగుతుంది. ఇక్కడ మన పూర్వాచార్యులు గుడజిహ్వికా న్యాయం అనే ఒక న్యాయాన్ని ఉదాహరిస్తారు. చేదుగా ఉండే మందును రోగి తీసుకోవడానికి ఇష్టపడనప్పుడు వైద్యుడు ఆ మందును బెల్లంతో కలిపి ఇస్తాడు. అప్పుడు ఆ మందును రోగి ప్రీతితో తీసుకుంటాడు. ఆ విధంగానే ఇక్కడ కూడా వేదాంత తత్వాలను శాస్త్ర ప్రక్రియలో పలికినట్లయితే అవి కఠినంగా ఉంటాయి కనుక,.వాటిని మధురంగా ఉండే శృంగార రసాన్ని మేళవించినప్పుడు అవి చాలా మధురంగా ఉంటాయి అని భావించి నమ్మాళ్వారులు ఈ విధంగా శృంగార రస ప్రస్తావన ద్వారా వేదాంతార్థాలను ఆవిష్కరించారు అని మన పూర్వాచార్యులు చెప్పే రీతి చక్కగా సమన్వయాన్ని పొంది, ఆళ్వారుల మనస్సును చక్కగా తెలియజేస్తున్నది.

91) శృంగారః ప్రథమో రసేషు తదయం సంసూచయత్యచ్యుతం
యో విద్యోతతి సర్వదైవనివహేష్వాద్యశ్చ సర్వప్రభుః,
తస్మాత్తద్రసవర్ణనేన భగవన్నారాయణప్రాభవ—
ప్రస్తావే న హి కోఽపి దోషలవ ఇత్యాచార్యవాక్ జృంభతే.

కావ్య రసాలలో శృంగార రసం మొట్టమొదటిది. అందువల్ల ఈ రసం దేవతలు అందరిలో మొట్టమొదటివాడు, అందరికీ అధిపతి అయిన అచ్యుతుని నిర్దేశిస్తుంది. అందుచేత శృంగారరస వర్ణన ద్వారా భగవన్నారాయణుని వైభవ ప్రస్తావన చేయడంలో ఏ విధమైన దోషం కొంచెం కూడా లేదు— అని చెప్పే మన ఆచార్యుల సూక్తి గొప్పగా ప్రకాశిస్తున్నది.

92) తత్త్వం శ్రీకృష్టభక్తే రుదితమిహ శఠార్యాకృతిం సమ్యగేత్యే
త్యాహు ర్నో దేశికేంద్రాః సువిదితశఠజిత్ హార్దతాత్పర్యసారాః,
స్మృత్వా శృంగారదైవం పునరపి చ పునః భావనాయాః ప్రకర్షాత్
ఆరోప్య స్త్రీస్వభావం కవిరపి వదతీదృగ్విధానేన వాచః.

శ్రీకృష్ణభక్తితత్వమే నమ్మాళ్వారుల రూపంలో అవతరించింది అని ఆ నమ్మాళ్వారుల హృదయంలోని అభిప్రాయసారాన్ని గమనించిన మన పూర్వాచార్యులు అంటారు. ఈ విధంగా ఉండే, శృంగార రసాధి దేవత అయిన శ్రీకృష్ణుని మనసులో మాటిమాటికి భావించిన నమ్మాళ్వారులు సతతత భావనాబలం చేత స్త్రీస్వభావాన్ని పొంది, ఈ విధంగా శృంగార ప్రక్రియలో వచనాలను పలుకుతున్నారు.

93) సాక్షాన్మన్మథమన్మథానవరతస్మృత్యా హ్యనుస్యూతయా
సమ్యక్ సంస్కృతమానసః శఠరిపుః స్త్రీభావ మారోపయన్,
ఆత్మన్యేవ మలౌకికాతివిమలప్రేమోక్తిజాలం వదన్
స్వం కామం శ్రుతిసమ్మతం చ భగవల్లక్ష్యం వ్యనక్తీతి శమ్.

"సాక్షాన్మన్మథమన్మథః" అని చెప్పబడినట్లు మన్మథుని హృదయాన్ని కూడా హరించే అందాన్ని కలిగిన శ్రీకృష్ణుని ఎల్లప్పుడు భావన చేయడంచేత సంస్కరించబడిన మనసును గలవారైన నమ్మాళ్వారులు తమలో స్త్రీభావాన్ని ఆరోపించుకొని, ఈ విధంగా అతి పవిత్రమైన, అలౌకికమైన ప్రేమ వచనాలను పలుకుతూ, వేదసమ్మతమైన, భగవంతుని విషయంలో తమ కోరికను ఇక్కడ వ్యక్తం చేస్తున్నారు. కనుక, అంతా సమంజసమే.

94) అన్యే వీరాద్భుతాద్యాః ఇహ శఠరిపుసత్కావ్యరాజప్రయుక్తాః
సార్థాః తే శ్రీశకీర్తిప్రకటనవిషయే సాధనీభూయ భాంతి,
నిర్వేదగ్లానిచింతాదికసకలవిధో భావజాలోఽప్యముష్మిన్
కావ్యే ప్రాప్తోఽన్వయం సన్ లసతి దిశతి చామందమోదం బుధానామ్.

నమ్మాళ్వారులు అనుగ్రహించిన, గొప్ప కావ్యమైన తిరువాయ్ మొழிలో పైన తెలిపిన విధంగా శృంగార రసం మాత్రమే కాదు, వీరరసం, అద్భుతరసం మొదలైన మిగిలిన రసాలు కూడా చక్కగా ప్రయోగించబడి, భగవంతుని వైభవాన్ని ప్రకటించడంలో సాధనాలు అవుతూ ప్రకాశిస్తున్నాయి. ఆ విధంగానే, నిర్వేదం, గ్లాని, చింత మొదలైన కావ్య భావాలు అన్నీ ఈ కావ్యంలో అన్వయాన్ని పొంది ప్రకాశిస్తున్నాయి.పండితుల మనసులకు అంతులేని ఆనందం కలిగిస్తున్నాయికూడా.

95) అంగీ శృంగార ఏవాత్ర, తదితరరసా అంగతాం యాంతి సర్వే,
మానం కిం స్యాదిహేతి ప్రభవతి సహజ స్సంశయో నో బలీయాన్,
కావ్యాంతే శ్రీశఠారేః ఫణితిసరణిరేవ ప్రమాణం బలిష్ఠం,
స్వార్తిః శాంతేతి తద్వాక్ సహృదయహృదయైః మానసే భావనీయా.

ఈ విధంగా తిరువాయ్ మొழி ప్రబంధంలో ఎన్నో రసాలు గోచరిస్తూ ఉన్నప్పటికీ,వాటిలో అంగిరసం శృంగారం రసమే. ఇది దివ్య శృంగారం తప్ప ,లౌకిక శృంగారం కాదు. ఈ శృంగార రస పోషణలోనే మిగిలిన అన్ని రసాలు అన్వయాన్ని పొందాయి. అయితే, ఈ విధంగా చెప్పడానికి ఏది ప్రమాణం? అనే బలమైన సందేహం మనకు సహజంగా కలుగవచ్చు. నమ్మాళ్వారులు ఈ ప్రబంధం చివరలో పలికిన మాటల రీతి ఈ ప్రబంధంలో ముఖ్యరసం శృంగారమే అనే విషయాన్ని తెలుపుతున్నది. "భగవంతుని సంశ్లేషించాలి అనే నా ఆర్తి అంతా తీరింది. భగవంతుడు నా ఆర్తి తీరే విధంగా నన్ను అనుగ్రహించాడు" అని చివరిలో నమ్మాళ్వారులు పలికిన మాటలను సహృదయులు గమనించాలి.

96) ఏకోఽప్యేవం శఠారిః కథమితి వదతి త్రిప్రకారేణ గాథాః
ఇత్యేవం భాతి శంకా ,గురుభిరిహ విద్భిః సమ్యగుక్తా సమాధిః,
ప్రజ్ఞా త్రైకాలికీ స్యా దత ఇహ మునిరాట్ వక్తి మాత్రాదివాక్యైః
త్రేధేతి ప్రాజ్ఞవర్గైః సునిశితమతిభిః జ్ఞాయతాం వస్తుతత్త్వమ్.

నమ్మాళ్వారులు ఒక్కరే కదా. మరి, తల్లిగా, చెలికత్తెగా, నాయకిగా –మూడు విధాలుగా ఏ విధంగా వారు పాశురాలను పాడడం సాధ్యం అవుతుంది? అనే ఒక ప్రశ్న మనకు కలుగుతుంది. మన ఆచార్యులు దీనికి సమాధానం చెప్పనే చెప్పారు. "ప్రజ్ఞా త్రైకాలికీ మతా" అంటే, బుద్ధి అనేది మూడు కాలాలలోనూ పనిచేస్తుంది. మూడు విధాలుగా పర్యవసించే శక్తి దానికి ఉన్నది. కనుక, గొప్ప ప్రజ్ఞావంతులైన ఆళ్వారులు ఈ విధంగా తమ అనుభవాలను మూడు విధాలుగా పలుకుతున్నారు అని నిశితమైన బుద్ధిని కలవారు గమనించాలి.

97) పూరోత్పీడతటాకతో జలపరీవాహాః స్రవంతో బహిః
నిర్గచ్ఛంతి, తదైవ తస్య సరసో రక్షా భవేత్ పూర్ణశః,
ఏవం శ్రీశమహోద్ధృతానుభవనీరౌఘఃశఠారిహ్రదాత్
త్రేధా గచ్ఛతి నాయికాళిజననీవాగ్భిః బహిః సుందరమ్.

నీటితో నిండిన తటాకంనుండి జల ప్రవాహాలు బయటకు వెళ్లిపోతాయి. అప్పుడే ఆ సరస్సుకు పూర్తిగా రక్షణ కలుగుతుంది. ఆ విధంగానే నమ్మాళ్వార్ అనే సరస్సు నుండి చాలా ఉధృతమైన, భగవంతుని అనుభవం అనే నీటి ప్రవాహం పరాంకుశనాయిక, ఆమె తల్లి, ఆమె చెలికత్తె అనే ముగ్గురి మాటలు రూపంలో అందంగా బయటకు వస్తున్నది.

98) శ్రీవృత్తాఖ్యప్రబంధో దశగుణిత లసద్రూపవిస్తార మేత్య
శ్రీవాగుక్తిప్రబంధోఽభవదితి మహతాం సంప్రదాయే ప్రసిద్ధమ్,
సోఽయం రామానుజాంతాది సుకృతిముఖతః సంగ్రహం చాప్య రూపం
భాతీతి ప్రాహురార్యాః సుమహితచరమోపాయతత్త్వప్రకాశః,

నమ్మాళ్వారుల మొదటి ప్రబంధం అయిన తిరువిరుత్తం పది రెట్లు విస్తరించి తిరువాయ్ మొழி ప్రబంధంగా మారింది అని పెద్దల సంప్రదాయంలో ప్రసిద్ధి చెందింది. ఆ విధంగానే, ఈ ప్రబంధం చరమోపాయ తత్వ సారాన్ని వ్యక్తం చేసే ఇరామానుశనూత్తందాది ప్రబంధంగా సంగ్రహ రూపాన్ని పొందింది అని పెద్దలు అంటారు.

99) ఓంకారః శతధా సహస్రవిధలో విస్తారమేత్య శ్రుతేః
ఆకారం భజతీతి వైదికసదస్యంగీకృతైతన్మతమ్,
ఏవం హి ప్రణవః సహస్రవిధలో విస్తృత్య విస్తృత్య సః
శ్రీవాగుక్తిరభూదితి శ్రుతిరహస్యార్థావగాహీరణా.

ఓంకారమే నూరురెట్లుగా, వేయి రెట్లుగా విస్తరించి వేదరూపాన్ని పొందింది అనేది వైదికసభలో సమ్మతమైన మాట. ఆ విధంగానే, ఆ ప్రణవం వేయి విధాలుగా విస్తరించి తిరువాయ్ మొழி ప్రబంధంగా మారింది అనేది వేద రహస్యాన్ని అవగాహించినవారి మాట.

100) వేదేషు త్రిషు సామనామకశ్రుతిస్థానేఽహ మస్మీతి వాక్
శ్రీగీతాప్రథితా మురారిముఖతః సాక్షాద్భహిః నిర్గతా,
తద్దేవప్రభవాదివైభవపరా గానాత్మికేయం కృతిః
శ్రీవాగుక్తిసమాఖ్యకాఽపి సదృశీ సామ్నేతి విద్వన్మతమ్.

"వేదానానాం సామవేదోఽస్మి"– మూడు వేదాలలో నేను సామవేదాన్ని– అనే సాక్షాత్తూ భగవద్గీతలో శ్రీకృష్ణుని ముఖంనుండి ఉద్భవించిన సూక్తి సుప్రసిద్ధం. అంటే, సామవేదం భగవద్రూపమైనది అని అర్థం. ఆ శ్రీకృష్ణుని అవతారం మొదలైన వైభవాలను

స్తుతించేది, గానప్రాధాన్యాన్ని కలిగినది అయిన తిరువాయ్ మొழி ప్రబంధం సామవేదంతో సమానమని పెద్దల అభిప్రాయం.

101) క్షీరాబ్ధే రుదితో గిరిప్రమథితాత్ పీయూషసారోఽమరైః
భోగ్యో నశ్వరదేహరక్షణవిధావేవ క్షమః కేవలమ్,
అబ్ధేః శ్రీకురుకేశ్వరాచ్చ మథితాత్ ప్రజ్ఞాద్రిణా యోదితా
శ్రీవాగుక్తిసుధా తు రక్షతి సదాఽత్మానం చ నో సర్వధా.

మందరపర్వతంతో చిలికిన పాలసముద్రంనుండి పుట్టిన అమృతసారం అనేది కేవలం నశ్వరమైన దేహాన్ని మాత్రం రక్షించగలదు. కానీ, నమ్మాళ్వారులు అనే పాలసముద్రం నుండి వారి బుద్ధి అనే కవ్వంతో చిలికినప్పుడు పుట్టిన తిరువాయ్ మొழி ప్రబంధం అనే అమృతం మాత్రం ఆత్మను కూడా అన్ని విధాలుగా రక్షిస్తుంది.

102) సౌందర్యం ద్రుపదాధిరాజతనయాదేహే యథాఽకర్షకం
స్త్రీణా మప్యభవత్, తథైవ పురుషం శోభా హరేః కర్షతి,
తత్, దృష్ట్వా పరమాత్మనః శఠరిపుః లోకాతిగం సౌభగం
స్త్రీభావం సముపేత్య వక్తిరనఘః శృంగారపూర్ణం వచః.

ద్రౌపదీదేవి దేహంలోని సౌందర్యం ఏ విధంగా స్త్రీలకు కూడా ఆకర్షణీయం అయినదో ,ఆ విధంగానే భగవంతుని దివ్యదేహశోభ పురుషుని కూడా ఆకర్షిస్తుంది. అందుచేత ఆళ్వారులు పురుషులైనా, అద్భుతమైన భగవంతుని సౌందర్యాన్ని దర్శించి, స్త్రీభావాన్ని పొంది, శృంగార వచనాలను పలుకుతున్నారు.

103) కాచిత్ స్త్రీ మితసౌభగా హరతి చేత్ స్త్రీణాం మనోఽస్మిన్ జగ
త్యాశ్చర్యం కిమిహోచ్యతాం యది హరేత్ పుంసః స్వయా శోభయా?
ఇత్యేవం సుధియో వదంతి సరసం కైముత్యనీత్యోత్తరం
యుక్తం, యేన సమర్థితా శఠరిపోః స్త్రీభావనా తత్కృతౌ.

ఈ లోకంలో పరిమితమైన అందాన్ని కలిగిన ఒకానొక స్త్రీ ఇతరస్త్రీల మనస్సును ఆకర్షిస్తున్నది అని అంటే, ఇక తన అలౌకికమైన శోభతో భగవంతుడు పురుషుల మనస్సులను హరించడంలో ఆశ్చర్యం ఏమున్నది?అని ఇక్కడ బుద్ధిమంతులు కైముతికన్యాయాన్ని అనుసరించి సమాధానం చెబుతారు. దీనివల్ల నమ్మాళ్వారుల.స్త్రీ భావన చక్కగా సమర్థింపబడినది.

104) శ్రీశస్యైవేయ మాత్మా భవతి, శరణ మప్యాత్మనః శ్రీశ ఏవ
స్యాదాత్మా శ్రీశభోగ్యః, క్షణమపి సహతే నాస్య జీవో వియోగమ్,
నిర్వాహ్యోఽనేన నిత్యం సతతమపి, తతో భాతి జీవేశబంధో
భార్యాభర్తృస్వరూపాత్మక ఇతి సుధియాం సంమతం సన్మతం చ.

ఈ జీవాత్మ శ్రీమన్నారాయణుని సొత్తు. ఇతనికి శరణం కూడా ఈ శ్రీమన్నారాయణుడే. ఈ జీవాత్మ భగవంతునికే భోగ్యుడు. భగవంతుని వియోగాన్ని సహించి క్షణం కూడా నిలువ లేడు. భగవంతుని చేతనే నిర్వహింపబడవలసినవాడు. ఈ కారణాల చేత జీవ పరమాత్మల మధ్య ఉండే సంబంధం భార్యాభర్తృ సంబంధంవంటిది అని పండితులకు సమ్మతమైన గొప్ప మతం.

105) స్వర్గే కల్పతరుః దదాతి సకలానిష్టాన్ పుమర్థాన్ స్వయం
సర్వేభ్యః, పరమేష నైవ కుశలః శ్రీశం ప్రదాతుం పరమ్,
శ్రీవాగుక్తికృతిస్తు లౌకికవరైః సార్ధం సమస్తైః దిశ—
త్యర్థం శ్రీపతివైభవానుభవదం సర్వోత్తమం చాపి నః.

స్వర్గలోకంలో ఉండే కల్పవృ క్షం అడిగినవారికి అన్ని విధాలైన అర్థాలను ఇవ్వగలదు గానీ, భగవంతుడనే పరమ పురుషార్థాన్ని మాత్రం ఇవ్వలేదు. కానీ, తిరువాయ్ మొ<u>ழி</u> ప్రబంధం మాత్రం, ఈ లోకంలోని సమస్తపురుషార్థాలను ఇవ్వడంతో పాటు భగవదనుభవాన్ని కలిగించే పరమపురుషార్థాన్ని కూడా ఇస్తుంది

106) వీణాతంత్రిస్వనో వా! శఠమథనకవేః కావ్యగీతీరవో ఽయం
పీయూషం వా పయోబ్ధేః! మధురరసమయం పాయసాన్నం భవేద్వా.!
రాకాచంద్రాతపో వా! మలయగిరిసముద్భూతశీతానిలో వా!
మందారోదారగంధో( మోదో) ఽప్యనిమిషనయనద్వంద్వవీక్ష్యం చ పర్వ ?

వీక్ష్య భవే న్నేత్రపర్వ!

ఈ తిరువాయ్ మొళ్ళి ప్రబంధ పాశురాల ధ్వని వీణతీగలు శబ్దించినప్పుడు వచ్చే మధురమైన ధ్వనియా? లేక, పాలసముద్రంనుండి పుట్టిన అమృతమా? లేక, మధుర రసమయమైన పాయసాన్నమా?లేక, పున్నమినాటి చంద్రుని వెన్నెలయా? లేక,మలయపర్వతం నుండి పుట్టిన చల్లని గాలియా? లేక, మందార పూల గొప్ప సువాసనయా? లేక, రెప్పపాటు లేని రెండు నేత్రాలతో దర్శించదగిన ఉత్సవమా?

107) అశ్వగ్రీవగళోద్భవాగమమయో హేలారవః స్యాదయం?
పోత్రికంఠబహిర్గతామృతసమో ఘోణాధ్వనిర్వా భవేత్?
శ్రీమద్ధంసకృతో చతుర్ముఖకృతే వేదోపదేశో భవేత్?
శ్రీవాగుక్తిమహాప్రబంధరసవద్గీతీసహస్రధ్వనిః.

చాలా తీయని పాశురాలను కల తిరువాయ్ మొళ్ళి ప్రబంధధ్వని హయగ్రీవస్వామి గళంనుండి ఉద్భవించిన వేదమయమైన ధ్వనియా? లేక, వరాహస్వామి ముఖంనుండి పుట్టిన, అమృతంవంటి మధురమైన ఘుర్ఘురధ్వనియా? లేక, హంసావతారం ఎత్తి బ్రహ్మకు భగవంతుడు చేసిన వేదోపదేశమా?

108) శ్రీరామప్రభుదివ్యకార్ముకకృతః టంకారనాదోఽథవా
శ్రీగోపాలకవేణురంధ్రనిగళత్సంగీతశాస్త్రక్రమః,,
శ్రీకూర్మోక్తవినోదపూర్వకశుభశ్రౌతార్థసారో భవేత్
శ్రీవాగుక్తిరియం సమస్తజనతాసంరక్షణే దక్షిణా.

లోకంలోని జనులను అందరిని రక్షించడంలో సమర్థమైన తిరువాయ్ మొళ్ళి దివ్యప్రబంధం శ్రీరామచంద్రుని గొప్ప వింటినుండి పుట్టిన టంకార ధ్వనియా? శ్రీకృష్ణుని వేణువునుండి పుట్టిన సంగీత శాస్త్రక్రమమా? లేక, కూర్మావతారంలో భగవంతుడు లీలగా చేసిన వేద ధర్మాల సారమా?

109) శ్రీరంగాదికదివ్యదేశవిలసత్ శ్రీకేశవార్చ్యాః స్వయం
ప్రాప్య శ్రీకురుకాపురే శఠరిపుం వేగాత్, తదగ్రే స్థితాః,
తాన్ సర్వానపి వర్ణయన్ మునివరో గాథాసహస్రే ముదా
తత్తన్మూర్తిగతాన్ విలక్షణగుణాన్ సంసూచయామాస తాన్.

శ్రీరంగం మొదలైన దివ్య దేశాలలో ప్రకాశించే అర్చా మమూర్తులు వేగంగా నమ్మాళ్వారుల సమక్షానికి వచ్చి నిలిచారు. ఆ మూర్తులను అందరిని తిరువాయ్ మొళ్ళి ప్రబంధంలో ఆళ్వారులు కీర్తిస్తూ ఒక్కొక్క మూర్తిలో ఉండే ఒక్కొక్క విలక్షణమైన గుణాన్ని సూచించారు.

110) శ్రీవాగుక్తిప్రబంధం శఠమథనకృతం వేదతత్త్వప్రపూర్ణం
శబ్దార్థాలంకృతీద్ధం రసికజనమనోహృద్రసైః బంధురం చ,
ఆత్మశ్రేయఃప్రదానే కుశలతమ మిమం శింగరాచార్యదాసః
స్తోకాభిః వాగ్భిరిత్థం చపలమతిరయం సంస్తువన్ ధన్య ఆసీత్.

నమ్మాళ్వారులు అనుగ్రహించినది ,వేదార్థాలతో నిండినది, శబ్దార్థాలంకారాలతో ప్రకాశించేది, రసికజన హృదయాలను ఆకర్షించే రసాలతో కూడినది, ఆత్మక్షేమాన్ని

కలిగించేది అయిన తిరువాయ్ మొழி ప్రబంధాన్ని చాపల్యంతో, చాలా అల్పమైన వాక్కులతో శింగరాచార్య దాసుడు ఈ విధంగా వర్ణించి ధన్యుడు అయ్యాడు.

★★★★★★